# ఎమర్సన్ వ్యాసావళి

అనువాదం :

బి. వి. శ్రీనివాసాచార్య

గుండిమెడాస్ :: ఏలూరు.

# ఉపోద్ఘాతము

రాల్ఫ్‌వాల్డో ఎమర్సన్ (1803-1882) అమెరికా సంయుక్తరాష్ట్రములందు పుట్టిపెరిగిన పెద్దమేధావి. ప్రపంచ మందలి ప్రసిద్ధప్రవక్తలలో ఎన్నదగిన మనీషి. నూరేండ్ల క్రిందట వ్యాసములలోను ఉపన్యాసములలోను ఇతడు వెల్వ రించిన భావనలు, ఆదేశములు, ఉపదేశములు ఆనాటివారే కాదు, ఈనాటివారున్ను అతని దేశస్థులే కాదు, ప్రపంచ మందలి యందరున్నూ తెలిసికోదగినవి; నిత్యజీవిత మందనుస రింపదగినవి. ఇతని గ్రంథములు - అందును ఎక్కువగా ఇతని వ్యాసములు- ఆంగ్ల సాహిత్యమందు అగ్రస్థానమందుండ దగినవి. అట్టిమహనీయుని వ్యాసములలో ప్రశస్తములయినవి కొన్ని ఎంచి తెలుగున అనువదించి ప్రకటించుచున్న శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులుగారు తెలుగువారికి మహోపకారము చేసి వారి కృతజ్ఞతకు పాత్రము కాగలరని నా నమ్మకము; వీరికి నా ధన్యవాదములు.

ఎమర్సన్ సర్వతోముఖ పాండిత్యము గలవాడు; పాండిత్యము కంటెను ఎక్కువగా మెచ్చుకోదగిన స్వతంత్ర బుద్ధి, అంతరజ్ఞత, ఇతని వ్యాసములందు స్పష్టముగా గోచ రించును. తాను విశ్వసించిన సత్యమును వెల్వరించుటలో గాని, లోకుల లోపములను వివరించుటలో గాని భీతి చెందని ధైర్యశాలి యని యితడు పేరుపొందెను. సద్భావముతో ఇతడు పండితులందును పామరులందును, పెద్దలయందును పిన్నలయందును గల దురభిప్రాయములను, రాగద్వేషాదు

లను విమర్శించినప్పుడు దురహంకారము గలవారు కొందరు ఇతనిని సరిగా అర్థము చేసికోలేక నిందించినా కాలక్రమేణ ఇతని ప్రవచనములను శిరోధార్యములుగా ఎన్ని సంభావించిన వారు అసంఖ్యేయులయినారు.

ఇతడు కొద్దికాలము మాత్రమే విద్యాలయమందు ఉపాధ్యాయునిగా పనిచేసి విరమించినా-యావజ్జీవము వయోజనవిద్యావ్యాప్తికై ఎక్కువగా కృషిచేసిన ఆచార్యసత్తముడు. దేశమందు జనసామాన్యమునకు విజ్ఞాన మలవరచుటకు పెక్కు ఉపన్యాసము లిచ్చిన వక్త. ఇతని వ్యాసములు తాత్కాలిక ప్రయోజనముమాత్రమే కలవి గాక, చిరకాలము ఉపయుక్తములు కాదగినవి అనేకముగా ఉన్నవి. అట్టి వ్యాసములలో మేలయిన వొక నాలుగు :- 'రాజనీతి', 'కళ-విమర్శ', 'సత్యము', 'మహాపురుషులు' అనే విషయములకు సంబంధించినవి ఎంచి శ్రీ శ్రీనివాసాచార్యులు తెలిగించి ఎమర్సన్ మహాశయుని ఆశయములను తెలుగు వారికి అందజేసినారు. ఈ నాలుగు వ్యాసములున్ను నాలుగు ప్రత్యేక సంస్కృతివిషయములకు సంబంధించినవి. రాజనీతి అనే వ్యాసములో అధికారధనమదాంధత వలన పెద్దలకును అజ్ఞానాంధత వలన పిన్నలకును రాజ్యాంగసంస్థల విధానములు, ప్రయోజనములు, విశిష్టతలు మొదలయిన అంశములను గూర్చి నెలకొనియున్న దుర్భ్రమలను తొలగించుటకు ఎమర్సన్ ప్రదర్శించిన చారిత్రక నిదర్శనములు గ్రహింపదగినవి. దురభిమానముచేత మనము మన దేశమందలి ఆచారవ్యవహారములు, సంస్థలు ఉత్కృష్టములని ఎంచు

కొందుమే కాని, శాశ్వతమైన ఉత్కృష్టత మానవనిర్మిత మైన యేసంస్థ యందును ఉండదనిన్ని, ఉత్కృష్ట మను కొన్నది దేశకాలపరిస్థితులను బట్టి నిర్ణయించుకోదగిన దే అనిన్ని, మానవులందరున్ను సంపూర్ణవివేకము గలవా రయినయెడల రాజ్యాంగచట్టములు, నియమములు, నిబంధ నలు మొదలయినవి అనావశ్యకములే కాదగుననిన్ని ఎమర్సన్ నిరూపించెను. నేడు ఆదర్శప్రాయముగా నున్న సంక్షేమరాజ్యమునకు సంబంధించిన అంశములు కొన్ని ఇతని హృదయములో ఉండినట్లు ఈ వ్యాసము చదివినవారికి గోచరించును.

ఎమర్సన్ రచించిన 'కళ-విమర్శ' అనే వ్యాసము రచయితలందరూ-అందులో ముఖ్యముగా మన తెలుగు రచయితలు మరల మరల జాగ్రత్తగా పఠించి అర్థముచేసికో వలసిన వ్యాసము. రచయితలు సాధారణముగా చేసే తప్పు లను ఇతడు ఎత్తిచూపి ఖండించినాడు. ఇతడు చూపిన దోషాలలో కొన్ని-పునరుక్తములు, స్పష్టతలేని మాటలు, అపక్రమములు, వ్యర్థపదములు, అపార్థపదములు, చుట్టుత్రో వలు, స్వమతవిరోధములు మొదలయినవి మన లాక్షణికులు పేర్కొన్నవి మాత్రమే కాక-వ్యవహారభ్రష్టములు, కేవల శబ్దాడంబరములు, అనవసర పాండిత్య విలసితములు అయిన ప్రయోగములు దోషములుగానే ఎంచి ఇతడు ఉదాహరణ సహితముగా వివరించినాడు. జీవద్భాషాప్రాభవమును ప్రశం సించినాడు ; మట్టిముద్దనుండి కళావిలసితమైన విగ్రహమును తయారుచేయు శిల్పి అనవసరమైన మట్టిని తీసివేయునట్లు

కావ్యరచయిత జనసామాన్యము వాడుకొను భాషనే ఎత్తు కొని తనకు కావలసిన మాటలు కళాదృష్టితో గ్రహించి అనవసరము అసభ్యము అయిన పదజాలమును తొలగించి రచనసాగించుటే ఉత్తమ రచనకు లక్షణమని బోధించినాడు. రచన సాగించుటే కాక విమర్శ సరిగా చేయుట కూడా ఒక కళయే అని విశదీకరించినాడు. ''సత్యము'' అనే వ్యాస ములో ఇతడు వివరించిన ప్రముఖ విషయములు మనకు క్రొత్తవి కావు గాని దాని లక్షణము నిరూపించి అందుకు తగిన నిదర్శనములను ప్రదర్శించుటలో ఎమర్సన్ అవలం బించిన పద్ధతి రసవంతమైనది. సత్యవర్తనము ప్రకృతిధర్మ మనిన్ని, నాగరకత చెందిన వారిలోనే అది తగ్గుననిన్ని, వాస్తవమైన సభ్యత, సంస్కృతి పొందినవారిలో అది మరల సలక్షణముగా నిలవగల దనిన్ని ఇతడు విశదపరచెను. ఏయే దేశములవారు ఈ సత్యమును ఏయే విధముల ఎంతవరకు పాటించినారో ఇతడు వివరించినాడు.

మహాపురుషులను గూర్చి ఇతడు రచించిన వ్యాస ములో ఎట్టిపురుషులు మహాపురుషులు ? అనే విషయము ఒకొక్కరు ఒకొక్కవిధముగా ఎట్లు భావింతురో, అది వారి వారి అభిప్రాయములను బట్టి అభిరుచులను బట్టి ఎట్లు మారుతూ ఉండునో ఎమర్సన్ చక్కగా వివరించినాడు. ప్రపంచ సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడిన వారందరూ ఇతని దృష్టిలో మహాపురుషులే–బాహ్యదృష్టికి పెద్దవిగాను స్పష్టము గాను కనిపించే వస్తువుల నిర్మాతలే కాక చిత్తశుద్ధికి, హృదయవికాసమునకు, ఆత్మసౌష్ఠవమునకు తోడ్పడిన

మేధావులు కూడా ఎక్కువగా కీర్తింపదగిన మహాపురుషులని ఎంచి పేర్కొనెను.

పైని పేర్కొన నాలుగు వ్యాసములును ఉన్నతములైన భావనలతో ఉదాత్తమైన శైలిలో రచితములయినవి. వాటిని తెలుగున అనువదించుట తేలికయిన పనికాదు. ఆంగ్లేయులకు అలవడిన భావనలు, ఆశయములు, సంప్రదాయములు మన దేశమందలి జనసామాన్యమునకు క్రొత్తవి. అందుచేత ఎమర్సన్ రచించిన వ్యాసములు ఆంగ్ల జనసామాన్యమునకు బోధపడునంత సులభముగా ఆంధ్రజన సామాన్యమునకు బోధపడవు. అందులోను ఆంగ్లభాషలో చెప్పినది తెలుగుభాషలో చెప్పినప్పుడు అది బోధపరచుకొనుట మరింతకష్టమయినది. అయినా శ్రీ శ్రీనివాసాచార్యుల అనువాదము మూలమునుఅనుసరించి కాస్తఅయినా ఉపజ్ఞగల తెలుగువారికి బోధపడగల పద్ధతిని రచితమయినదని నా యభిప్రాయము. అందుకు వారి కృషిని అభినందిస్తూ తెలుగువారీ గ్రంథమును ఆదరించి పఠింతురుగాక అని కోరుతున్నాను.

మద్రాసు - 5, గి. వేం. సీతాపతి, బి. ఏ. డి. లిట్
2 - 3 - 1956. సెనేటర్, మద్రాసు విశ్వవిద్యాలయము.

# విజ్ఞప్తి

కార్లైల్ వలె ఒక విశిష్టమైన ఆంగ్లభాషాశైలిని వెలయించిన వశ్యవాక్కు ఎమర్సన్. వాక్యములు భావబంధురములుగా నుండుటే కాదు, వాక్యమునకు, వాక్యమునకు మధ్య నొక బ్రహ్మాండము నాతడిముడ్చును. అందువల్లనే ఆంగ్లములోని ఎమర్సన్ వ్యాసములు భాషావైశారద్యముతో పాటు భావపరిణతి కూడ గలవారికే ఆస్వాద్యము లగుచున్నవి. "కళ-విమర్శ" అనే వ్యాసములో ఒక ఉత్తమ రచనను ప్రశంసించుచు ఎమర్సన్-"అందుండి రచయిత కన్నులు మన కన్నులలోనికి చూచుచున్నట్లుండును. ఒకప్పుడు హుంకరించుచు, మరొకప్పుడు చిరునవ్వు నవ్వుచు, వేరొకప్పుడు గొంతుక తగ్గించి రహస్యము చెప్పువానివలె మాటలాడుచు, ఇంకొకప్పుడు మేఘగంభీర గర్జనలు చేయుచు, భుజము లెగుర వేయుచు, తేరిపార చూచుచు రచయిత మన మనో నేత్రము ముందు సాక్షాత్కరించి మనతో ప్రసంగించుచున్నట్లుండును." అని వ్రాసెను. ఈ వర్ణనము ఆ ఉత్తమ రచన సంగతి ఎట్లున్నను ఎమర్సన్ రచనలకు పూర్తిగా అన్వయించును.

ఎమర్సన్ వ్యాసముల నాంధ్రీకరింప బూనుట కొంత వరకు సాహసమని నేను గుర్తింపకపోలేదు. అయినను ఇంతవరకు ఆంధ్రపాఠకునకు అచుంబితమైన ఎమర్సన్ భావనా పద్ధతిని యథాశక్తిగానైన పరిచయ మొనర్పగలిగినచో, అది ముమ్ముందు ఇంతకంటె ఉత్తమానువాదాలకు త్రోవ దీయగలదను ఆశతో నే నీ సాహసమునకు ఒడి గట్టినాను.

అనువాదములో నాకు యుక్తములని తోచిన విధానాలను నేను పాటించితిని. ముఖ్యముగా ఎమర్సన్ వాడిన ఉపమానములు, రూపకములు– అవి ఆంధ్రపాఠకునకు అపరిచితములని ఎరిగియు– వాటిని మార్చినచో ఎమర్సన్ భావనలలోని వైచిత్ర్యము తగ్గునని భావించి, వాటిని యథాతథముగానే ఆంధ్రీకరించినాను. సాధ్యమైనంతవరకు స్వాతంత్ర్యము వహింపక మూలములోని భావచ్ఛాయల నన్నిటిని యథాతథముగా తెలుగులోనికి దెచ్చుటకే యత్నించితిని. కాని, ఎమర్సన్ భావనలోని మెలికల నన్నిటిని సరిగా గుర్తించుటలో గాని, గుర్తించిన వాటిని సక్రమముగా తెలుగులో ప్రకటించుటలో గాని పలుతావుల నేను ప్రమాదపడి యుండవచ్చును. తద్జ్ఞులు అట్టి నా స్ఖాలిత్యములను తెలుపుచో మలి ముద్రణమున కృతజ్ఞతాపూర్వకముగ సవరించుకొనగలనని మనవి.

నేను కోరగానే నా యుండలి వాత్సల్యముతో నాయీ గ్రంథమునకు ఉపోద్ఘాతము వ్రాసి నన్ను ప్రోత్సహించిన డా॥ గి. వేం. సీతాపతిగారికిని, వ్యాపారదృష్ట్యా లాభదాయకము కాదని తెలిసియు కేవలము విజ్ఞాన ప్రీతితో ఈ గ్రంథప్రచురణకు నడుముకట్టిన "గుండిమెడాన్" అధిపతి శ్రీ జి. ఈశ్వరరావు కణ్వాగారికిని, ఈ గ్రంథ ముద్రణములో అందచందములు తీర్చి నాకు చేదోడైన మిత్రుడు శ్రీ వి. నారాయణరావునకును నేను మిక్కిలి కృతజ్ఞుడను.

మద్రాసు–14,
2 – 3 – 1956.

అ ను వా ద కు డు.

# విషయసూచిక







# రాజనీతి

రాజ్యమును గూర్చి చర్చించునపుడు కొన్ని విషయములు మనము గుర్తుంచుకోవలెను. రాజ్యములోని వివిధ సంస్థలు మనము పుట్టకముందు నుంచి ఉన్నను అవి అనాదులు మాత్రము కావు; పౌరునికంటె అవి ప్రబలతరమైనవీ కావు; వాటిలో ప్రతి ఒక సంస్థా ఒక మనిషిచేత సృష్టింపబడినదే! ప్రతి శాసనమూ, ప్రతి ఆచారమూ ఒకానొక ఆవశ్యకతను తీర్చుటకు ఎవడో ఒకడు కల్పించినదే! అవి అన్నీ అనుకరించుటకు వీలైనవీ; అవసరమైనచో మార్చుకోదగినవీ. అంతేకాక—అంత మంచి శాసనాలను, అంతకంటె మంచివాటిని మనముకూడ తయారుచేసుకోవచ్చును. యువపౌరులకు 'సమాజ' మొక ఎండమావిగా తోచును. అచలమై స్థిరరూపమున సమాజము ఉన్నట్లును, కొన్ని పేర్లు, కొందరు వ్యక్తులు, కొన్ని సంస్థలు స్థిరముగా వ్రేళ్ళు పాతుకొనిన ఓక్ చెట్లవలె కేంద్రముగా ఏర్పడి, ప్రజ లందరూ ఆ కేంద్రము చుట్టూ తమకు చేతనైనంత ఉత్తమ పద్ధతిలో వర్తించుచున్నట్లును అతనికి గోచరించును. కాని, తల నెరసిన రాజ్యనిర్వాహకుడు (Statesman) సమాజము పరిణామాత్మకమనీ, దానికి వ్రేళ్ళు పాతుకొనిపోయిన స్థిర కేంద్ర

# విషయసూచిక







# రాజనీతి

రాజ్యమును గూర్చి చర్చించునపుడు కొన్ని విషయములు మనము గుర్తుంచుకోవలెను. రాజ్యములోని వివిధ సంస్థలు మనము పుట్టకముందు నుంచి ఉన్నను అవి అనాదులు మాత్రము కావు; పౌరునికంటె అవి ప్రబలతరమైనవీ కావు; వాటిలో ప్రతి ఒక సంస్థా ఒక మనిషిచేత సృష్టింపబడినదే! ప్రతి శాసనమూ, ప్రతి ఆచారమూ ఒకానొక ఆవశ్యకతను తీర్చుటకు ఎవడో ఒకడు కల్పించినదే! అవి అన్నీ అనుకరించుటకు వీలైనవీ; అవసరమైనచో మార్చుకోదగినవీ. అంతేకాక-అంత మంచి శాసనాలను, అంతకంటె మంచివాటిని మనముకూడ తయారుచేసుకోవచ్చును. యువపౌరులకు 'సమాజ' మొక ఎండమావిగా తోచును. అచలమై స్థిరరూపమున సమాజము ఉన్నట్లును, కొన్ని పేర్లు, కొందరు వ్యక్తులు, కొన్ని సంస్థలు స్థిరముగా వ్రేళ్ళు పాతుకొనిన ఓక్ చెట్లవలె కేంద్రముగా ఏర్పడి, ప్రజ లందరూ ఆ కేంద్రము చుట్టూ తమకు చేతనైనంత ఉత్తమ పద్ధతిలో వర్తించుచున్నట్లును అతనికి గోచరించును. కాని, తల నెరిసిన రాజ్యనిర్వాహకుడు (Statesman) సమాజము పరిణామాత్మకమనీ, దానికి వ్రేళ్ళు పాతుకొనిపోయిన స్థిరకేంద్ర

ములు లేవవి, ఉన్నట్టుండి ఏ ఒక పరమాణువైనను ఆ చక్ర
భ్రమణములో కేంద్రస్థానము నాక్రమించి, మిగిలిన సర్వము
తన చుట్టు భ్రమించునట్లు చేసికొనగలదనీ గుర్తించును.
హిట్లర్, క్రాంవెల్ ల వంటి దృఢసంకల్పులు కొంతకాలము.
పా[illegible]న్న, ప్లేటో, పాల్ ల వంటి సత్యజీవనులు జీవితాద్యంత
మున్ను ఈ సత్యము దర్శించినారు. అయితే-రాజనీతి బల
మైన పునాదులమీద నిలచిఉండకపోలేదు. నిరాధారమైన
కట్టడముగా దానిని భావింపరాదు. ప్రజాసత్తాక రాజ్యాలలో
(Republics) – శాసనాలే సర్వము అనీ, రాజ్యదృక్పథము
లోను, ప్రజల జీవిత విధానములోను తీవ్రమైన పరిణామ
ములు శాసనామోద నిరాకరణముల వలననే జరుగుననీ,
ఎంత అసందర్భమైన శాసనమైనను తగినంతమందిచేత చేతు
లెత్తింప గలిగినచో చట్టమైపోగలదనీ భావించు యువకులు
పుష్కలముగా నుందురు. కాని, వివేకవంతులు మాత్రము
దుష్టశాసనము మెలివెట్టినంతనే నశించు ఇసుకత్రాడు వంటి
దనీ. రాజ్యము పౌరుని స్వభావమును, ప్రకృతిని అనుసరింప
వలెనే గాని తానై వాటిని రూపొందింప జూడరాదనీ
గ్రహింతురు. అన్యాయముగా అధికారము కైవసము చేసి
కొను వాడు ఎంత బలవంతుడైన అంత త్వరగా పదచ్యుతు
డగును. కొన్ని సూత్రముల ప్రాతిపదికపై నిర్మింపజూచు
వారే శాశ్వత సంస్థలను నిర్మింపగలరు. ఒక ప్రభుత్వము ఆ
ప్రభుత్వాధికారమునకు హేతుభూతమైన ప్రజల నిజస్వరూప
మునే ప్రతిబింబించును. శాసన మనునది కేవల మొక నివే

దిక (memorandum). మనము అంధవిశ్వాసముల కలవాటు పడినాము; చట్టమును కొంతవరకు పెద్దచేయుదుము. నిజము నకు–తత్కాలీన ప్రజల స్వభావములోని శక్తియే దాని జీవితకాలావధిని నిర్ణయించును. నేడొక చట్ట మమలులో నుండును. నిన్న ఫలానావిధముగా ఉండవలెనని మనమంద రము ఆమోదించి దానిని రూపొందించితిమి గనుక అది అమలుజరుగుచున్నది. నేడు దానివిషయమై మన భావ మేమి అని మనము ప్రశ్నించుకోవలెను. మన చట్టము మన ప్రతిరూపముతో ముద్రించిన ఒక కరెన్సీనోట్ వంటిది. అనతికాలములోనే అది గుర్తింపరానివిధముగ మారిపోయి, కాలక్రమేణ తిరిగి టంకసాల చేరుకొనును. ప్రకృతిలో ప్రజా స్వామిక లక్షణాలుగాని, పరిమితాధికారయుత రాజ్యలక్ష ణాలు గాని లేవు; అది నిరంకుశము. తన బిడ్డలలో అత్యంత నిపుణుడైన వానికిగూడ తన అధికారములో అరవీసమైన అపహరించు అవకాశ మీయదు. అధికారుల తెలివి అధిక మైనకొద్దీ వారు చేయు నిబంధనావళిలో నిర్జీవిత, తొట్రుపాటు కూడ అధికమగుచుండును. ఆ నిబంధనలు స్పష్టముగ దేనినీ చెప్పవు; వాటి అర్థము స్ఫుట మొనర్చు అవసర మేర్పడు చుండును. కాని, ప్రజాసామాన్యములో మనోవికాస ప్రక్రియ నిరంతరాయముగా సాగుచునే ఉండును. నిరా డంబరులైన సత్యజీవనుల మధుర స్వప్నాలు భవిష్యత్తును ముందుగా సూచించును. సరసాత్ములైన ఈనాటి యువకులు ఏ విషయాలను గూర్చి కలలు గందురో, ప్రార్థనలు సేయు

మరో. చిత్రములు చిత్రించేరో ఆ విషయములే క్రమముగా ప్రజాసంస్థల తీర్మానములుగా అవతరించి, తర్వాత నివేదికలుగాను, హక్కుల పత్రాలుగాను రూపొంది, సంఘర్షణలతో సమరాలతో కొంతకాలము గడచిన తర్వాత ఫలవంతములై శాసనరూపము పొందును. తిరిగి నూతన ప్రార్థనలు, నూతన చిత్రములు కలయువరకు కొన్నేళ్ళపాటు అవే శాసనాలుగా చెల్లుబడి అగును. ఒక రాజ్య చరిత్ర స్థూలముగా ఆ రాజ్య ప్రజల భావనా వికాస పరిణామమును సూచించు రేఖా చిత్రమువలె పొసగును, దూరమున కనవచ్చు సంస్కృతి అను ఆశయము వంకకు పురోగమించుచుండును.

మానవుల మేధలలో మథనము పొంది, వారు చేసిన శాసనాలలోను, నడిపిన విప్లవాలలోను సాధ్యమైనంత ఎక్కువగా వ్యక్తీకరింపబడిన రాజనీతి సిద్ధాంతముల ప్రకారము వ్యక్తుల, వారి ఆస్తిపాస్తుల రక్షణయే ప్రభుత్వకర్తవ్యము. వ్యక్తులలో అందరు ఒకేస్వరూపస్వభావములుగలవారగుటచే అందరికీ సమానములైన హక్కులుండును. ఈ అంశము పూర్తిగా ప్రజాస్వామికమునే సమర్థించును. కాని, వ్యక్తులుగా అందరి హక్కులు సమానములే అయినను, వారి వారి ప్రత్యేకకారణాలవల్ల ఆస్తిపాస్తులమీది వారి హక్కులు మాత్రము పూర్తిగా అసమానములు. ఒకనికి కట్టుగుడ్డలు తప్ప వేరు ఆస్తి ఉండదు. మరొకనికి చిన్న జమీ ఉండును. ముఖ్యముగా వారివారి ప్రజ్ఞాప్రాగల్భ్యములలోగల తరతమ భావమున్ను, కొంతవరకు వారివారి విభిన్న పైతృక సంక్రమణ

మున్ను ఇందుకు కారణములు. ఈకారణములు అసమానము లగుటచే ఆస్తిపాస్తులపై వారి హక్కులుకూడ అసమాన ములుగానే ఉండును. సర్వసమానములైన వ్యక్తిగత స్వామ్యములదృష్ట్యా జనాభాలెక్కల నిష్పత్తి ననుసరించి ప్రభుత్వాలు నడవవలెను; ఆస్తిహక్కులప్రకారము ఆస్తుల యజమానులను, వారి యాజమాన్యమును దృష్టిలోఉంచు కొని ప్రభుత్వాలు పనిచేయవలెను. మందలకొద్ది గొర్రెలు, పశువులుఉన్న 'లాబాన్' తన పశువులను మిడియానైట్లు (మిడియాన్ మూలపురుషునిగాగల ఉత్తరఅరేబియాలోని ఒక తెగవారు; బైబిల్‌లో వీరి ప్రసక్తిఉన్నది.) వచ్చితోలు కొని పోకుండా ప్రభుత్వము ఒక ఉద్యోగిని నియమించవలెనని కోరును, అందుకువలసిన పన్నుకూడా చెల్లించును. మరి 'జాకోబ్'నకు గొర్రెలమందలు, పశువులమందలులేవు కనుక మిడియానైట్లకు భయపడుటగాని కాపలా ఉద్యోగినిమిత్తము పన్ను చెల్లించుటగాని చేయడు. తమ వ్యక్తిరక్షణ కవసర మైన ఉద్యోగిని ఎన్నుకొనుటలో లాబాన్, జాకోబ్‌లకు సమానమైన హక్కులున్ను; గొర్రెలను, పశువులను కాపలా కాయు ఉద్యోగిని ఎన్నుకొనుటకు జాకోబ్‌కు కాక లాబాన్ కొక్కనికే ప్రత్యేకమైన హక్కున్ను ఉండుట సముచితము గానే తోచును. అంతేకాక-ఇంకను ఎక్కువ ఉద్యోగులను రక్షణదుర్గములను ఏర్పరచుకొను సమస్యవచ్చినప్పుడు - లాబాన్, ఇజాక్‌లకును, వారివలెనే ఇతరుల రక్షణకై తమ పశువులమందలలోకొంతభాగమును పోకడపెట్టుకోవలసివచ్చిన

వారికిని, ఇతరుల రొట్టెపై బ్రదుకు యువకయాత్రీకునకు జాకోబ్ కంటె ఎక్కువ బాధ్యతతో ఆలోచించుకోవలసిన అవసరమున్నదికదా!

ఆదిమ సమాజములో ప్రతివ్యక్తిఆస్తియు వాని స్వార్జితమే! అట్లు ప్రత్యక్షముగానే ఆస్తిసంక్రమించుచు వచ్చినంతకాలము ఆస్తివిషయమైన నిబంధనలు ఆస్తిపరులును వ్యక్తులకు సంబంధించిన నిబంధనలు వ్యక్తులును చేసుకోవలె ననితప్ప, ధర్మపరాయణమైన ఏ సంఘములోను మరొక అభిప్రాయము తలయెత్తు అవకాశమే లేదు.

కాని, క్రమముగ దానమువలనను వారసత్వమువలనను స్వయముగా ఆర్జింపనివారికి ఆస్తి సంక్రమించుట తటస్థించెను. ఆస్తిపై స్వయముగా ఆర్జించినవానికిఉండు పూర్తి హక్కు దానమువలన ప్రతిగ్రహీతకు సంక్రమించుచుండెను. ఇక పైతృకముగా ఆస్తిసంక్రమించు సందర్భములో శాసనమే ఆ యాజమాన్యమును స్థిరపరచుచుండెను.

ఆస్తిసంబంధములగు నిబంధనలను ఆస్తిపరులును వ్యక్తులకు సంబంధించిన నిబంధనలను వ్యక్తులును చేసికోవలెనను సూత్రము మొదట సులభామోదము పొందినను, ప్రతి సందర్భములోను వ్యక్తులు, ఆస్తి విడదీయరాకుండ కలసి పోవుచుండుటవలన ఆ సూత్రము అంతసులభముగా అనుష్ఠింపదగినది కాకపోయెను. చిట్టచివరకు "న్యాయ్యమగునదే సమ

ముగా నున్నదని భావింపవలెనుగాని, సమానముగా నుండుటే న్యాయ్యమని ఎంచరాదు." అనుస్వార్టన్ సూత్రము ననుసరించి ఆస్తిగలవారికి ఇతరులకంటె ఎక్కువ హక్కు ఉండవలెనను విచక్షణే న్యాయసమ్మతమైనదిగా స్థిరపడినట్లు తోచెను.

తొలి రోజులలో అంత ప్రత్యక్షసత్యముగా తోచినట్టి ఆసూత్రము తరువాత ఎంతో కాలము నిలువలేదు. ఆస్తి సంబంధమైన శాసనాలకు అధికప్రాధాన్యం ఇవ్వబడినదనీ, ఆవిధమైన వ్యవస్థలో ధనికులు పేదలహక్కులను హరించుటకు, పేదలను పేదలుగానే ఉంచుటకు అవకాశములు కలుగుచున్నవనీ శంకలు పొడముట ఇందుకుకొంతవరకు కారణము. ఇంతకంటె బలమైన కారణము- ఆవిధమైన హక్కులతో కూడిన నాటి ఆస్తివ్యవస్థ విపత్కరమైనదనీ, దానివలన వ్యక్తులు భ్రష్టులైపోవు ప్రమాదమున్నదనీ ఒక స్వాభావసిద్ధమైన భావము (అది ఎంత అస్ఫుటముగను, అవ్యక్తముగను ఉన్నను) మానవులలో కలుగుట. ఆస్తి వ్యక్తికి అంగభూతము గానే ఉండవలెననీ, ప్రభుత్వముల చరమలక్ష్యము వ్యక్తుల సంస్కృతిఅనీ, వ్యక్తులను విద్యావంతుల నొనర్చినచో, వారి అభ్యున్నతి రాజ్యసంస్థలకుకూడ సంక్రమించి, కొన్ని నైతిక భావనలే రాజ్యశాసనములను రూపొందించుననీ వారు భావింపసాగిరి.

ఈ సమస్యలో ధర్మాధర్మనిర్ణయము సుకరముకాదు, కాని, మనకు ప్రకృతిసిద్ధముగనున్న రక్షణలను పరిశీలించి

నచో ఈ సమస్యతీవ్రత కొంత తగ్గిపోగలదు. మనమెన్ని కొన్న మ్యాజిస్ట్రేట్లకన్న బాగుగా మనను రక్షించగల బలవత్తర ప్రాకృతికశక్తులు కొన్నిగలవు. సమాజములో అధిక భాగము యువకులు,అవివేకులు అగువారితో నిండియుండును. న్యాయస్థానములయు, రాజ్యనిర్వాహకులయు దంభాచారమును గుర్తెరిగిన వృద్ధులు చనిపోవుచు, తమ బిడ్డలకు తమ వివేకమును సంక్రమింపజేయరు. తమ తలిదండ్రులు వారి యౌవనకాలములో విశ్వసించినట్లే ఆ బిడ్డలును వార్తాపత్రికలనే విశ్వసింతురు. అట్టిఅజ్ఞానులును, సులువుగ వంచింపనగువారును అధికసంఖ్యాకులుగానున్న రాజ్యాలు త్వరలోనే దారుణరూపము దాల్చును. కాని, ఆపాలకుల అవివేకమూ, దురాశా, అధిగమింపలేని ఒక అవధిఉన్నది. మనుష్యులకే కాదు శాసనాధికారము; పరిస్థితులకుకూడ అట్టి అధికారమున్నది. ఒకస్థితికి వచ్చుసరికి మానవులు పరిస్థితులను తేలికగా త్రోసివేయలేని దశ వచ్చును. ఆస్తులు సురక్షితములై తీరును. విత్తులుచల్లి, ఎరువులు పెట్టకయే వరిపండదు - నిజమే! కాని, పంట తనచేతికందు అవకాశమునూటికి తొంబదితొమ్మిదిపాళ్ళు కన్పించినగాని రైతు విత్తనములు చల్లడు; ఎరువులు పెట్టడు. ఎట్టి ప్రభుత్వవిధానములో అయినను వ్యక్తులూ, ఆస్తులూకూడ తమ న్యాయమైన హక్కులను పొంది తీరును. పదార్థము తన ఆకర్షణశక్తిని నెరపునంత నియతముగ వ్యక్తులయు, ఆస్తులయు ప్రభావము వ్యక్తమగును. ఒకపౌను మట్టిని ఏమిచేసినను అది మారదు. ఎన్ని

విభాగాలు చేసినను, నీటిలో కరగించి ద్రవము చేసినను, వేడి చేసి వాయుపదార్థముగా మార్చినను అది పౌను బరువే తూగును; ఒకపౌను పదార్థపు ఆకర్షణశక్తి పూర్తిగా దానిలో నిలచియే ఉండును. అదేవిధముగా మానవుని స్వభావమూ, అతని తెలివీ, అతని నైతికశక్తీ ఎట్టి శాసన విధానములోనైనను, ఎంతటి దారుణపరిపాలనలో అయినను తమ ప్రభావము కనబరచి తీరును. బహిరంగముగానో లేక రహస్యముగానో, శాసనబద్ధముగానో లేక శాసనవిరుద్ధము గానో, సక్రమమార్గముననో లేకవక్రమార్గముననో, హక్కుల నిరూపణతోనో లేక భుజశక్తి ప్రదర్శనతోనో అది వ్యక్త మగుట తథ్యము.

వ్యక్తులు నైతిక, లేక ప్రకృత్యతీతశక్తికి చిహ్నము లగుటచే వారి ప్రభావపు అవధులను నిర్ధరింపగలుగుట అసంభవము. పౌరస్వేచ్ఛ, మతవిశ్వాసము వంటి భావ ములు ప్రజానీకము నావేశించినప్పుడు ఆ ప్రజల శక్తి లెక్కలు కట్టుటకు లొంగకుండపోవును. ఐకకంఠ్యముగ స్వేచ్ఛనో, విజయమునో ఆకాంక్షించుఒక జాతి – గణనా శాస్త్రజ్ఞుల అంచనాల నన్నిటిని తారుమారు చేయగలదు; తన సాధన సంపత్తికి మించిన అసాధారణ ఫలితాలను సాధించివేయగలదు. గ్రీకులు, సారసనులు, స్విట్జర్లండ్ ప్రజలు, అమెరికనులు, ఫ్రెంచివారు ఇందుకు దృష్టాంతములు.

ఇదేవిధముగ ఆస్తి విషయములోగూడ – ప్రతి ఒక కణమునకు దాని ఆకర్షణశక్తి దానికి గలదు. 'శతాంశము'

(Cent) అనునది ధాన్యములోగాని, మరొక పదార్థములోగాని, ఒక పరిమాణమును సూచించును; మనుష్యుని ఆవశ్యకతలను బట్టి దాని విలువ నిర్ణీతమగుచుండును. అది వెచ్చదనము, రొట్టె, నీరు, భూమి-వీటిలోని అంశమైయుండును. ఆస్తిమీది హక్కుదారు విషయమున న్యాయశాస్త్రము తన ఇచ్ఛవచ్చినట్లు ప్రవర్తింపవచ్చును; కాని, ఆస్తిలోని 'శతాంశము' నుండికూడా దాని శక్తిని తొలగింపజాలదు. ఒక ఉన్మాదదశలో న్యాయశాస్త్రము ఆస్తిదారులు తప్ప ఇతరు లందరికి అధికారము ఉండునట్లును, ఆస్తిదారులకు వోటు హక్కు కూడ లేకుండునట్లును శాసింపవచ్చును. కాని, అంతకంటె ఉన్నతమైన మరొక న్యాయశాస్త్రము సహాయమున ఆస్తిదారులు ఆస్తిని గౌరవించు చట్టాలను ఏటేటా తయారుచేయించుకోగలరు. ఆస్తిలేనివారే ఆస్తిదారులకు ఆ చట్టములు వ్రాయు వ్రాయసగాండ్రగుదురు. ఆస్తిదారుల కోర్కెలను ఆస్తి సాధించిపెట్టును. వీలైనచో శాసనబద్ధముగాను, లేకున్న శాసనములను ధిక్కరించియైన ఆస్తి తన ప్రభావమును వెలయించును. నేను అన్ని విధములగు ఆస్తి విషయమై ప్రస్తావించుచున్నాను గాని, కేవలము పెద్దపెద్ద జమీలనే దృష్టిలో పెట్టుకొని ఈమాట చెప్పుటలేదు. తరచు జరుగుచున్నట్లు ధనాఢ్యులెప్పుడైన అధికసంఖ్యాకపు వోట్లచే ఓడింపబడినారన్నచో అట్లు ఓడించిన పేదల సమష్టి ఆస్తియొక్క బలము ఆ ధనాఢ్యుల ఆస్తి బలముల నతిశయించినదని అర్థము. ప్రతివ్యక్తికీ ఎంతో

కొంత ఆస్తి ఉండితీరును. అది ఒక ఆవు కావచ్చును; చిన్న తోపుడుబండి (Wheel barrow) కావచ్చును; లేక అతని చేతులే కావచ్చును. ఆ ఆస్తికూడ తన ప్రభావమును వెల యించి తీరును.

మ్యాజిస్ట్రేట్ల ద్రోహబుద్ధినుంచీ, ప్రమత్తతనుంచీ వ్యక్తులకూ, ఆస్తులకూ రక్షణ ఇచ్చే హక్కుల ఆవశ్య కతయే పరిపాలనా విధానములను రూపొందించును. ఆ విధా నములు వివిధ జాతులకు తత్తద్భావనాసంప్రదాయముల కనుగుణముగా భిన్నభిన్నములై యుండును. ప్రతి ఒక జాతి పాలనా విధానమూ ఇతర జాతులవారు ఏ ఒక అంశములో గూడ అనుకరించుటకు వీలులేని విధముగా రూపొందును. ఈ దేశము (అమెరికా) లో మనము మన రాజకీయ సంస్థ లను గూర్చి ప్రగల్భము లాడుకొనుచుందుము. ఈ తరము వారికి ఇంకను జ్ఞాపకముండు నంతటి కొద్దికాలము క్రితమే అవి వెలసియుండుటే వాటి ప్రత్యేకత! అవి మన ప్రజల స్వభావములోనుండి, పరిస్థితులలోనుండి పుట్టుకొని వచ్చినవి; నేడును ఈ ప్రజలు ఆ స్వభావమునే, ఆ పరిస్థితులనే వ్యక్త పరచుచున్నారు. మనము ఈ సంస్థలను చరిత్రలో ఇతర సంస్థ లన్నిటికంటె ఉత్కృష్టతరములని ఆర్భాటముతో చెప్పుకొందుము. నిజమున కవి ఉత్కృష్టతరములు కావు; మన పరిస్థితుల దృష్ట్యాయోగ్యతరములు మాత్రమే! అధు నాతనకాలములో ప్రజాస్వామిక విధాన మధిక ప్రయోజన కరమను మన ఊహ వివేకమంతమైన కావచ్చును; కాని,

శాస్త్రముచే రాజత్వవ్యవస్థ పవిత్రమైనదిగా తీర్చిదిద్దబడిన ఇతర రాష్ట్రాలకు అదే ప్రయోజనకరమైనది గాని ఈ ప్రజాస్వామికము కాదు. నేటి మన మత విశ్వాసములు ప్రజాస్వామికమునకు అనుగుణ మైనవి గనుక ప్రజాస్వామ్యమే మనకు మంచిది. జన్మతః ప్రజాస్వామికవాదులమైన మనము రాజత్వవ్యవస్థలోని మంచిచెడ్డలను నిర్ణయించుటకు అనర్హులము. రాజత్వసిద్ధాంత వాతావరణములో పెరిగిన మన తాతముత్తాతలకు కూడ సాపేక్షముగా అదే మంచిదిగా తోచెను. అయితే-మన సంస్థలు ఎంతగా ప్రస్తుత యుగధర్మమున కనుగుణములై యున్నను, ఇతర ప్రభుత్వ విధానాల నపమార్గములు పట్టించిన ఆచరణలోపముల విషయములో ఇవికూడ అపవాదములు కాజాలవు. ఆచరణలో ప్రతిరాజ్యమూ దుష్టమే! సత్పురుషులు శాసనాలను మరీ, తు. చ. తప్పకుండ పాటింపరాదు. యుగయుగాలుగా 'జిత్తుల మారితనము' నకు పర్యాయముగా ప్రసిద్ధమైన 'పొలిటిక్' అను పదమునకంటె ఏ వ్యంగ్య పరిహాస కావ్యము ప్రభుత్వ విధానమును ఎక్కువగా హేళన చేయగలదు? రాజ్యమనునది ఒక బూటకమని ఆ పదము చాటుచున్నది.

ప్రజలయు, ఆస్తులయు హక్కుల రక్షణావశ్యకత, ఆచరణలో సిద్ధాంతము అపమార్గము పట్టుట-అనే ఈ రెండు భావములే రాజ్యములలోని రాజకీయ పక్షములలో కూడ ప్రతిఫలించుచున్నవి. ప్రభుత్వనిర్వహణావిధానములను వ్యతిరేకించు పక్షములో మొదటి భావము సమర్థించు పక్షములో

రెండవ భావము వ్యక్తమగును. రాజకీయపక్షములు కూడ సహజప్రవృత్తి (Instinct) అను ప్రాతిపదికమీద నే స్థాపితము లగుచుండును. వాటికి తమ వినీతలక్ష్యములను సాధించు కొనుటలో తమ నాయకుల విచక్షణజ్ఞానమును మించిన మార్గదర్శక సూత్రములు గలవు. మూలములో ఏ రాజకీయ పక్షమూ వక్రబుద్ధి సంజాతము కాదు. ఒక వాస్తవిక, చిరంతనసంబంధమును సూచించు ఒక మొరటు చిహ్నము గానే అది వెలయును. ఒక రాజకీయ పక్ష ప్రాదుర్భావమును నిరసించుట ఎదురుగాలిని, మంచుజడులను నిరసించునంతటి వివేకవంతమైన పని. ఏలనన – ఆ రాజకీయపక్షములోని చాలమంది సభ్యులు తామూ పక్షములో ఎందుకు చేరిరో తెలియనివారు. తాము ఉన్న పరిస్థితుల దృష్ట్యా తమ భద్రతకొరకు వారందు చేరుట తప్పనిసరి అయినది. అంత వరకు తప్పు లేదు. కాని, వారు ఆ గాఢమైన సహజావశ్య కతను విస్మరించి ఏ నాయకుని ఆ దేశముననో వైయక్తిక ప్రయోజనముల ననుసరించుచు, తమ పరిస్థితుల కేవిధము గాను సంబంధించని కొన్ని సూత్రముల భద్రతకొరకు నడుము కట్టినప్పుడే పేచీవచ్చుచున్నది. ఒక రాజకీయ పక్షము నిరంతరాయముగా వ్యక్తుల మూలమున కలుషిత మగు చుండును. ఒక సమాజముయొక్క అవిశ్వసనీయతాదోష మును మనము క్షమింపవచ్చును గాని, వ్యక్తులవిషయమున అదేవిధమైన ఔదార్యము మనము చూపలేము. తమ మాటమీద నడచే ప్రజానీకపు విధేయతవల్లా, ఉత్సాహము

వల్లా సాధింపబడిన ఫలితాలను ఆ నాయకులు అనుభవించుచుందురు. సాధారణముగా మన రాజకీయ పక్షములు కొన్ని పరిస్థితులు కారణముగా పుట్టునవే కాని, ఒక సిద్ధాంత ప్రాతిపదికపై వెలయునవి కావు; వాణిజ్యదృష్టితో కాక, కేవలము విలాసము కొరకు మొక్కలు నాటినట్లు వాటిని ఏర్పరచుచున్నాము;అవి పెట్టుబడిదారులకు వారి లక్ష్యములను సాధించిపెట్టుటకై ఏర్పడే పక్షములు; నైతిక ప్రవర్తనలో అన్నీ ఒకే శ్రేణికి చెందినవి; అందుచేతనే- చాల శాసనాల విషయములో ఏపక్షమైనను ఇతర పక్షాలతో చేతులు కలుపుటకు వీలగుచున్నది. మతసంస్థలూ, స్వేచ్ఛావాణిజ్య పక్షమూ, సార్వజనికమైన వోటు హక్కు సాధించుటకై ఏర్పడిన పక్షమూ, బానిససంస్థా నిర్మూలన పక్షమూ, మరణదండనప్రతికూలపక్షమూ మున్నగు వానివలె సిద్ధాంత ప్రాతిపదికపై వెలయు పక్షములు క్రమముగా వ్యక్తుల ప్రాభవమునకు లొంగిపోవుటో, లేక ప్రజలలో ఉత్సాహము రేకెత్తించుటో చేయును.

ఈవిధమైన పక్షములకు ఉదాహరణముగా మన దేశము (అమెరికా) లోని రెండు ప్రధానపక్షాలనూ పేర్కొనవచ్చును. కాని, వీటిలోఉన్న ప్రధానలోపము – అవి ముఖ్యముగా ఎందుకేర్పడినవో ఆగాధమైన ఆవశ్యకసిద్ధాంతములనే అంటిపెట్టుకొనిఉండక, ప్రజాసంక్షేమము (Common wealth) నకు ఏవిధముగానూ ఉపకరించని ఒక స్థానిక, తాత్కాలిక సమస్యవిషయమై కావేషములను పెంచుకొనుచుండుట. ఈ

క్షణమున మన జాతినంతటిని తమమధ్య విభజించి వేసుకొన్న ఈరెండు పెద్దపక్షాలలోను, నన్నడిగితే- ఒకదాని ఆశయాలు గొప్పవి; రెండవదానిలోఉన్నవ్యక్తులు గొప్పవారు. ఒక తత్త్వవేత్తగాని, ఒక కవిగాని, ఒక మతవిశ్వాసిగాని నిస్సంశయముగా తన వోటు డెమోక్రాటిక్ పార్టీకే వెయ్యవలెనని కోరును. స్వేచ్ఛావాణిజ్యమును, విస్తృతమైన వోటుహక్కును, దండనస్మృతిలో న్యాయముపేర జరుగు దారుణముల తొలగింపును, యువకులూ పేదలూ ధనమును అధికారమును కైవసమొనర్చుకొనుఅవకాశముల నెక్కువచేయుటను- డెమోక్రాట్లు సమర్థింతురుగనుక వారట్లు కోరుదురు. కాని, ప్రజాదరణము చూరగొన్నట్లు భావింపబడే ఆపక్షము తన ఉదారాశయాలకు ప్రతినిధులుగా నిలబెట్టు వ్యక్తులను మాత్రము వారు ఆమోదింపలేరు. 'డెమోక్రసీ' అనేపేరును ఆకర్షకముగాను, ఆశాజనకముగానూచేసిన ఉదాత్తలక్ష్యములను వేటినీ హృదయదఘ్నములుగా చేసుకొన్నవారు కారా ప్రతినిధులు. మన అమెరికన్ మౌలికపరిణామ భావన (Radicalism) వినాశాత్మకమైనదీ; లక్ష్యరహితమైనదీ. అది ప్రేమతో కూడినదికాదు; చరమలక్ష్యాలుగాని, పవిత్రాశయాలుగాని దానికిలేవు. కేవలము ద్వేషముతో, స్వార్థపరతతో నిర్మూలన మొనర్చుటే దానిపని. మరొకవంక - సమర్థులూ, సంస్కారులూఅగు మితవాదులుఉన్న కన్సర్వేటివ్ పక్షము భీరువు; కేవలము ఆస్తిసంరక్షణకే అది చూచును. అది ఏ హక్కులనూ సమర్థించదు; ఏనిజమైన మంచిపని చేయుటకునూ పూను

కొనను; ఏ అపరాధమునూ అభిశంసింపను; ఏ ఉదారవిధాన మునూ అమలు జరుపను; శాస్త్రముల, కళల అభివృద్ధికై అదేపనిగాయూ చేయను; మత ప్రబోధకులకు ప్రోత్సాహమీయను; స్కూళ్లు స్థాపింపను; బానిసల విమోచనమునకై గాని, పేదలను, ఎర్ర ఇండియనులను, దేశాంతరాగతులను మిత్రులను చేసికొనుటకుగాని కృషి చేయను. ఈ రెండు పక్షాలలో ఏది అధికారములో ఉన్నను, ఈజాతి సాధన సంపత్తికి తగినంతగా శాస్త్రములకుగాని, కళలకుగాని, మానవత్వమునకుగాని మేలు కలుగునను ఆశ లేదు.

ఈ లోపాలనుచూచి నేను మన 'రిపబ్లిక్' విషయములో నిరాశ చెందుటలేదు. మనము విధి చిద్విలాసముల దయాధర్మ భిక్షముమీద ఆధారపడి లేము. భయంకర రాజకీయపక్షాల సంఘర్షణమధ్య మానవప్రకృతి ఎప్పుడును పరిపుష్టమగుచునేయుండును. 'బోటనిబే' (ఆస్ట్రేలియాలో 'సిడ్నే' పట్టణమునకు దక్షిణముగానున్నది.) వద్ద నిర్బంధావాసము గడపువారి బిడ్డలు ఇతరప్రాంతములందలి బిడ్డలవలెనే ఆరోగ్యకరమైన నైతికభావములు కలిగియుండుటే ఇందుకు తార్కాణము. అరాజక పరిస్థితులకు త్రోవతీయుచున్న మన ప్రజాస్వామిక సంస్థలనుచూచి భూస్వామ్యవిధాన రాజ్యాల పౌరులు ఆందోళన చెందుచున్నారు. ఇక- మనలోనే వయోధికులూ, అప్రమత్తులూ అయినవారు యూరపియనులను చూచి, నిర్నిబంధముగ విజృంభించుచున్న మన స్వేచ్ఛపట్ల భీతాహమును ప్రకటించుట నేర్చుకొనుచున్నారు. మన

రాజ్యాంగమును వ్యాఖ్యానించుటలోని విశృంఖలత్వమును, మన ప్రజాభిప్రాయ నిరంకుశత్వమునుచూచి మ న జా తి లంగరులేని ఓడవంటిదని భావించువారున్నారు. ఒక వైదేశిక అవేక్షకుడు మన వివాహసంస్థ పావిత్ర్యములో మనరక్షణ సూత్రమిమిడియున్నట్లు భావించెను. మరొకరు అట్టి రక్షణ సూత్రము మననువలంబించుచున్న 'కాల్వినిజమ్' (ఫ్రెంచి మతాచార్యుడు కాల్విన్ బోధించిన సిద్ధాంతము) లో ఇమిడి ఉన్నట్లు కనుగొనెను. కాని, ఫిషర్ ఏమ్స్ ప్రజాభద్రతారహస్యమును ఇంతకంటెఎక్కువ వివేకవంతముగా వివరించెను. ఆయనరాజరికమునకు, ప్రజాస్వామికమునకుమధ్య తారతమ్య వివేచనచేయుచు రాజరికమును, ఒక పెద్దవాణిజ్యనౌకతో పోల్చెను. అదిసురక్షితముగానే ప్రయాణించునుగాని మధ్యలో ఏకొండకో కొట్టుకొన్నచో బుడుంగున మునిగిపోవును. ఇక – ప్రజాస్వామికమును ఎన్నడూ మునిగిపోని ఒకచిన్న తెప్ప కొయ్యకు ఆయన పోల్చెను. అది మునిగిపోదుగాని, మన పాదములు నిరంతరము నీటిలోనే నానుచుండును. ప్రాకృతిక న్యాయము మనకు అనుకూలముగా ఉండునంతవరకు ఎట్టిరాజ్యవిధానమైనా విపత్కరమైన ప్రాధాన్యమును పొందజాలదు. ఎన్ని టన్నుల వాతావరణము మన తలలమీద అదుముచున్నను, దానిని నిరోధింపగల ఒత్తిడి మన ఊపిరితిత్తులలో ఉన్నంతవరకూ ఏమీ భయములేదు. పదార్థమును వెయ్యింతలు పెంచినను, దాని శక్తితో సమానమగు ప్రతిశక్తి ఉన్నంతవరకు అది మనలను అణచివేయ

జాలము. రెండు ధ్రువములమధ్యా, కేంద్రాభిసారి, కేంద్రాపసారి శక్తుల మధ్యా వైరుధ్యము సార్వత్రికమైనది; ఆ ప్రతికూలశక్తులలో ప్రతిదీ తన ప్రవృత్తిచేతనే రెండవదానిని కూడ వివృద్ధమొనర్చుచుండును. అమిత విశృంఖలత అంతఃకరణ కాఠిన్యమును పెంపొందించును. స్వాతంత్ర్యాభావము శాసనములను, ఆచారములను అధిక శక్తిమంతము లొనర్చి అంతఃకరణము మొద్దువోవునట్లు చేయును. "లించ్ లా" (న్యాయశాస్త్రముపై ఆధారపడక వ్యక్తులు స్వయముగా అపరాధులను దండించు విధానము) నాయకులలో అధిక సాహసము, స్వయంవ్యక్తత ఉన్నప్పుడే విజృంభించును. ప్రజాసీకపు అధికారము శాశ్వతమైనదిగాదు; విడివ్యక్తుల ప్రయోజనములు ఆ సామూహికాధికారపు వినాశనమునే కోరుచుండును. ఇక-'ధర్మము' (Justice) మాత్రమే అందరిని తృప్తిపరచగలదు.

సర్వన్యాయ విధానాలలోనూ ప్రకాశించే శ్రేయోదాయి అయిన 'ఆవశ్యకత'నే మనము నిరంతరము నమ్ముకొని యుండవలెను. మానవుని ప్రకృతి అతని చట్టముల లోను, పాటలలోను, రైలురోడ్లలోను వ్యక్తమగునంత విస్పష్టముగా ఆ న్యాయవిధానాలలో గూడ వ్యక్తమగును; వివిధ జాతుల న్యాయసంహితల సారాంశములో మానవ జాతి అంతఃకరణము ప్రతిఫలించును. మానవులలోని నైతిక ధర్మసామ్యమే ప్రభుత్వముల ప్రభవస్థానము. ఒకరికి హేతుబద్ధముగా తోచు అంశము అందరికీ హేతుబద్ధముగానే

తోఁచును. రాజకీయపక్షములు అసంఖ్యాకముగ పెరుగ కున్నచో, అవి తమ తమ సిద్ధాంతముల పట్ల ఎక్కువ పట్టుదల చూపకున్నచో, ఆ పక్షముల నన్నిటిని సంతృప్తిపరచ గల ఒక మధ్యేమార్గము తప్పక దొరుకగలదు. అతిసాధార ణములైన తన హక్కులవిషయములోను, చర్యల విషయము లోను ప్రతి మనుష్యుడూ తన మనస్సు చేయు నిర్ణయాలనే శిరసావహించును; ఈ నిర్ణయములనే అతడు 'సత్యము, 'పవి త్రత' అనుచున్నాడు. ఈ నిర్ణయముల విషయములో మనుష్యు లందరిలోను, ఏకత్వము గోచరించును; వీటివిషయ ములో మాత్రమే అట్టి ఏకత్వము గోచరించును; ఏ ఆహా రము మంచిది, ఏ దుస్తులు ధరింపదగినవి, కాలమును సద్వినియోగము చేయుట ఎట్లు, ప్రతివానికీ ఉండదగు భూమి పరిమితి సౌకర్యముల విస్తృతి ఎంత-అను విషయ ములలో మరల అట్టి ఏకత్వ మెంతమాత్రమూ కన్పించదు. ఈ 'సత్యము'నే ఈ 'ధర్మము'నే భూమి పరిమితి, సౌకర్య విస్తృతి, ప్రాణధన సంరక్షణ మున్నగు విషయములలో అనువర్తింపజేయవలయునని మానవులు ప్రయత్నింతురు. వారి తొలి యత్నములు నిస్సంశయముగ చాల అసందర్భ ముగా కనిపించును. కాని ఆ స్వయంవ్యక్త (absolute) మగు సామ్యమే మొట్టమొదట మానవులను శాసించునది; అనగా-ప్రతిరాజ్యమూ అపరిశుద్ధమైన ఒక 'దివ్యరాజ్య' మే (Theocracy)! ప్రతిరాజ్యమూ తన శాసనాలను తయారు చేసికొనుటలోను, సవరించుకొనుటలోను వివేకవంతుడైన

మానవుని సంకల్పములనే అనుసరింపజూచును. కాని, లోకములో ఆ వివేక సంతుష్టైన మానవుని అది కనుగొనజాలదు. కాని. అసంపూర్ణమే అయినా హృదయపూర్వకముగా ఏదో ఉపాయమున ఆ వివేకి సంకల్పముల కనుగుణమైన ప్రభుత్వము స్థాపించుటకే ప్రతి రాజ్యమూ యత్నించును. ఉదాహరణకు-ప్రతిశాసనము పైనా ప్రజలందరి అభిప్రాయములను తెలుసుకొనుట ద్వారానో, అత్యుత్తమ పౌరుల నెంచుకొనుట ద్వారానో, లేక-సమర్థముగ పాలించుచు, ఆంతరంగిక శాంతి స్థాపించుటకై ఒకే వ్యక్తికి ప్రభుత్వమును వప్పగించి అతడే తన ప్రతినిధుల ద్వారా పరిపాలించు విధానము ద్వారానో అట్టి ప్రభుత్వమును స్థాపించుటకై ప్రతి రాజ్యమూ యత్నించును. ఈ విధముగా అన్ని ప్రభుత్వ విధానములూ ఒకే అమరప్రభుత్వ విధానమునకు చిహ్నములు. ఆ అమర ప్రభుత్వ విధానము అన్నిజాతులవారికీ సమానమే ! అది పాలకుల సంఖ్యామీద ఆధారపడినదికాదు; పాలకు రిద్దరు ఉండినను, ఒక్కడే ఉండినను అది సర్వసమగ్రమైన ప్రభుత్వవిధానమే!

ప్రతి మానవుని ప్రకృతీ తనతోటిమానవుల ప్రకృతిని గూర్చి అతనికి తెలుపజాలిన ప్రకటనపత్రము వంటిది. నా విషయములో ఏది ఒప్పో, ఏది తప్పో, ఇతరులందరి విషయములోకూడ అదేఒప్పు; అదేతప్పు. నాకు తగిన పనిలోనే నేను ప్రవర్తించుచు, తగనిపనినుండి నివర్తించుచు ఉన్నంత కాలము నాపొరుగువాడును నేనును మా విధానములలో

తరచు ఏకీభవించుచు, ఒకే లక్ష్యముకొరకు కొంతకాలము పాటు కలసి పనిచేయగలుగుదుము. కాని, ఎప్పుడైతే నా కార్యాచరణపరిధి నాకు చాలక వాని పరిధిలోనికికూడ అతి చరింతునో అప్పుడు నేను సత్యపథమును అతిక్రమించినవాడ నగుదును. నా పొరుగువానితో నాకుగల సంబంధాలలో అసత్యము అడుగుపెట్టును. అతనికంటె నేను యుక్తిశాలిని, బలశాలినిఅయి ఉండవచ్చును; అతడు తనకు జరిగిన అన్యాయమును తగిన విధముగా ప్రకటింపనుగూడ లేకపోవచ్చును; అయినా అది అసత్యమే! అసత్యమువలె అతనినీ, నన్నూ సరిసమానముగా బాధించును. మానవుని స్వభావము ఎంతో కాలము తన అభినయమును కొనసాగించలేదు; అది కార్య రూపము దాల్చిన అసత్యముగా, అనగా దౌర్జన్యముగా వ్యక్తముకాకతప్పదు. ఇట్లు పరుని వ్యవహారాలలో జోక్యము కలుగజేసికొనుటే ప్రపంచప్రభుత్వాలన్నిటిలోను అత్యంత వికృతముగా కనిపించే మహాపరాధము. ఇద్దరిమధ్య అది ఎంతతప్పో, చాలామంది విషయములోకూడ అంతేతప్పు; కాకపోతే-అప్పుడు అంతఎక్కువవిస్పష్టముగా అది కన్పించక పోవచ్చును. ఆత్మసంయమనమునకై నాపైన నేనే కొన్ని నియమములు విధించుకొనుటకు, అన్యుని ఎవరినో నాఅభిప్రాయానుసారము వర్తించునట్లు చేయుటకు నాదృష్టిలో ఎంతో తేడాఉన్నది. కాని, ప్రపంచజనాభాలో నాల్గవవంతు మంది నేను ఎట్లు ప్రవర్తించవలెనో నిర్ణయించే అధికారమును తమపై ఆరోపించుకొన్నప్పుడు, ఆ పరిస్థితులు నన్ను

కలవరపరచి, వారి ఆదేశములోని అసంబద్ధతను స్పష్టముగా గుర్తింపజేయకపోవచ్చును. అందుచేత వ్యక్తిగత ప్రయోజనముల అపేక్షయా సామూహిక ప్రయోజనములు అస్పష్టములుగాను, అసంబద్ధములుగాను కన్పించును. ఏలనన-మనుష్యులు తమకొరకు తాముచేసుకునే శాసనాలుతప్ప మరి ఏశాసనాలయినా పరిహాసాస్పదములే! నేను నాబిడ్డ మానసిక స్థితిని భావించుకొని, అట్లు అభేదముపొందిన దృష్టితో పరిస్థితులను అవేక్షించినప్పుడు, ఆ అవేక్షణమే మా యిద్దరికిని వర్తించు శాసనము కాగలదు, అంతేకాని, వాని ఊహాపద్ధతిని విస్మరించి, వాడు నాస్థితిలోఉన్నట్టు ఊహించుకొని నేను 'ఇదిఇల్లా చెయ్యి'అని వానిని ఆదేశించినచో వాడెన్నటికిని దానిని పాటింపడు. ఇదీ ప్రభుత్వములచరిత్ర-ఒకమనిషి మరొక మనిషికి వర్తించే శాసనాలు తయారుచేయుచున్నాడు. నాతో పరిచయము కలిగి ఉండుటకుకూడ వీలులేని ఒకవ్యక్తి నామీద పన్నులువిధించును, దూరముననుండి నన్ను చూచును; నా కష్టార్జితములో కొంతభాగమును నా భావనలో కాక, అతని భావనలోస్ఫురించినఒక కాల్పనిక ప్రయోజనముకొరకు వెచ్చింపవలెనని ఆదేశించును. దీనిపర్యవసానము చూడుడు. మానవుడు తన అప్పులన్నిటిలోను ఈపన్నుల చెల్లింపు విషయములోనే ఎక్కువ అనిష్టతను ప్రదర్శించుచున్నాడు. ఈ విషయము ప్రభుత్వములకు ఎంతతలవంపు కలిగించునట్టిది! ఒక్కపన్నుల విషయములోతప్ప ఇతరత్ర ప్రజలు తాము చెల్లించు మొత్త

ముల కన్నిటికి అందుకు తగిన ప్రతిఫలమును పొందుచున్నట్లు భావించుచున్నారు.

అందుచేత ప్రభుత్వాల అధికారమూ, శాసనాల సంఖ్యా ఎంత తగ్గితే అంత మంచిది. లాంఛనప్రాయమైన ప్రభుత్వాల అధికారము దుర్వినియోగము కాకుండా చూసేందుకు వ్యక్తియొక్క సచ్ఛీలము రక్షణగా ఉపయోగ పడును. అనగా—వ్యక్తిఅభివృద్ధి పొందవలెను; ప్రతినిధిని త్రోసిరాజని అసలువ్యక్తి ముందుకు రావలెను; 'వివేకి' ఆవిర్భవింపవలెను; నిజమునకు మన ప్రభుత్వాలన్నీ ఆ 'వివేకి'ని అతిసేరసముగా అనుకరించే నీడల వంటివే! లోకములో సర్వమూ—స్వేచ్ఛా, కృషీ, అన్యోన్య సంబంధాలూ, విప్లవాలూ—అన్నీ ఆ సచ్ఛీలము అనే గమ్యము వంకకే గమిస్తున్నవి; ప్రకృత్యధినాథుని ఆ పట్టాభిషేకమే ప్రకృతి పరమావధి. 'వివేకి' ని రూపొందించుటే రాజ్యముల కర్తవ్యము; ఆ 'వివేకి' ఆవిర్భవించగానే రాజ్యములు అంతరించును. 'సచ్ఛీల' ఆవిర్భావము జరుగగానే రాజ్యాల ఆవశ్యకత తీరిపోవును. 'వివేకి' యే నిజమునకు రాజ్యము. అతనికి సైన్యమూ, దుర్గములూ, నౌకాబలమూ—ఏవియు అక్కర లేదు; అతడు మానవుల నమితముగా ప్రేమించును; అతడు మిత్రులను సంపాదించుకొనుటకు లంచాలూ, విందులూ, రాజప్రాసాదాలలో వినోదపరచుటలూ, కీలకస్థానాలూ (Vantage grounds) - ఏవీ అవసరములేదు. అతనికి గ్రంథాలయ మక్కరలేదు—మరి ఆలోచింపవలసిన అవసరము లేదు

గనుక, 'చట్టముల గ్రంథము' (Statute book) అక్కరలేదు-తానే శాసనదాత కనుక. ధన మవసరములేదు-ఆ ధనము యొక్క విలువ అతడే కనుక. రోడ్లు అవసరములేదు-అత డెక్కడ ఉంటే అక్కడే ఆనందధామము గనుక. అనుభవము గడించే అవసరములేదు - సృష్టికర్తయే అతనిలో జీవించుచు, అతని కన్నుల గుండానే లోకమును చూచుచుండును గనుక. అతనికి వ్యక్తిగతముగా కొందరే మిత్రులని ఉండరు. మానవులందరి వినతులను, ప్రేమను చూరగొన గలిగిన అతనికి తన జీవితములో భాగము పంచుకొనుటకు ఎవరినో కొందరిని ఎంచుకొని తయారుచేసుకోవలసిన అవసరములేదు. మానవులతో అతని సంబంధము 'దివ్య' మైనది అతని స్మరణే వారిని తన్మయులను చేయును; ఇక-అతని సాన్నిధ్యము నిర్వాణమే కలిగించును.

మన నాగరకత మధ్యందినమార్తాండునివలె నడిమింటికెక్కి ప్రకాశించుచున్నదని మనము భావింతుము. కాని నిజమునకు మననాగరకత కోడికూతను, వేగుచుక్కనుగడచి ఒక్క అడుగైన ముందుకు వేయలేదు. ఆటవికమైన మన సమాజమువీూద సచ్ఛీలప్రభావము ఆరంభదశలోనే ఉన్నది. రాజకీయరంగములో సచ్ఛీలము ఒక ప్రబలశక్తిఅనీ, పాలకుల నందరిని వారి వారి సింహాసనాలనుండి పదచ్యుతులనుచేసే వాస్తవిక స్వామ్యముగల అధిపతిఅనీ ఇంకను మనము సరిగా గుర్తించలేదు. తామస్ రాబర్ట్‌మాల్థస్ (బ్రిటిష్ రాజనీతిక ఆర్థికశాస్త్రజ్ఞుడు 1776 - 1834), డేవిడ్ రికార్డో (బ్రిటిష్

రాజనీతిక, ఆర్థికశాస్త్రజ్ఞుడు, 1772-1823) ఈ విషయమును స్పృశింపనైనలేదు; వార్షికవివరణ గ్రంథమూ (Annual Register) మౌనము వహించినది; సంభాషణల నిఘంటువు (Conversations Lexicon.) లో దీని ప్రసక్తే లేదు; అధ్యక్షు సందేశముగాని, రాణిగారి ప్రసంగముగాని ఈ ప్రస్తావనే తెచ్చుటలేదు; అయినా-ఈ 'సచ్ఛీలము' ఎన్నటికీ అవాస్తవికము కానేరదు. ద్రష్టలూ, మహాత్ములూ ప్రకటించే ప్రతి ఊహాయు ఈ లోకమును మార్చుచున్నది. అధికార పదవులలోఉన్న మహామహులకుగూడ.- వారెన్ని దౌర్జన్య కవచాలను, కృత్రిమనేపథ్యాలను ధరించినా,- నిజమైన విలువయొక్క అస్తిత్వము అనుభూతమగుచునే ఉండును. వణిక్ప్రముఖులలోను, మహోన్నత వాంఛలు (Ambition) గలవారిలోను వ్యక్తమగు సంఘర్షణమే ఈ దివ్యశక్తి ఉనికికి నిదర్శనము. అంతేకాదు; ఆరంగాలలో వారు సాధించే విజయము పరిదుర్బలమైన సంతృప్తిసాధనము; అవమానితమైన ఆత్మ తననగ్నత్వమును కప్పుకొనజూచే చిన్ని ప్రయత్నమువంటిదది. అనిష్టముగానైనను ఆమహాశక్తిపట్ల గౌరవప్రకటనము ఇతర వర్గాలలోగూడ నాకు కన్పించుచున్నది. ఇంట్లుండుటకు కారణము: మనమెంతగా వెనుకబడిఉన్నామో మనమెరుగుదుము; ఆ నైరాశ్యమువల్లనే ఏలేశమాత్రము శక్తి కన్పించినను నిజమైన విలువగా ఎంచి, దానికి పట్టము కట్టుదుము. సచ్ఛీలస్వామ్యమునుగూర్చిన ఒక చైతన్యము మనను నిరంతరము ఆవేశించియున్నది; కాని దానికి మనము ద్రోహము చేయు

మము. అయితే-మనలో ప్రతిఒక్కరిలోను ఎంతో కొంత శక్తి ఉన్నది; ఉపయోగకరమైనదో ఉదారమైనదో, లాభదాయకమైనదో - ఏదో కొంతపని మనముగూడ చేయగలము. ఉత్తమ జీవనప్రమాణమును చేరుకోలేకపోయినందుకు ఒకసాకుగా తోటివారికిని, మన అంతరాత్మలకును సంతృప్తి చెప్పుకొనుటకై ఆపని మనము చేయుదుము. కాని, అదిమనకు తృప్తి నీయదు; అందుకే దానిని తోటివారు గమనించునట్లు చేయుటకై తాపత్రయ పడుదుము. అది వారి కళ్ళలో దుమ్ముకొట్టగలిగి ఉండవచ్చునుగాని, చింతాసూచకమగు మన బొమముడి విప్పుటకుగాని, మనసు దీర్ఘయాత్రలో శక్తిమంతులకుఉండు నిశ్చింతను మనకు కలిగించుటకుగాని ఉపకరించదు. మన ఈ యాత్రలో అడుగడుగున మనతపస్సు సాగుచునే ఉండును. మన ప్రతిభా లేశము ఒకవిధమైన పరిహారముగామాత్రమే భాసించును. మన జీవితాలలో ఒక ఘన కార్యము సాధించిన క్షణమును అతినమ్రతతో మనము స్మరించుకొందుము. జీవితములోని వివిధసంఘటనలలో అది కూడ ఒక సంఘటనఅని మనము భావింపము. అది చాలా ఉదాత్తమైనదనీ, మనలోని సనాతనమైన శక్తి స్రోతస్సుయొక్క ఉద్గారరూపమని మనము విశ్వసింతుము. శక్తిసామర్థ్యాలుగల చాలామందికి సమాజమునుండి ఒక నీరవవిజ్ఞప్తి వినిపించును. వారు "నేను సంపూర్ణముగా ఇచ్చుటలేను"అని బదులుచెప్పుచున్నట్లు కనిపింతురు. సెనేటర్లును,అధ్యక్షులును అంత ఉన్నతపదవులను చాల కష్టముమీదనే అధిరోహించ

గలిగిరి. అయితే–ఆ పదవులు చాలా సుఖావహములని వారు భావించుటవలనగాదు, కేవలము నిజమైన విలువలేమిని కప్పి పుచ్చుకొనుటకూ మాత్రమే వారు అన్ని అవస్థలుపడి ఆ పదవులకెగబ్రాకుదురు. వారి ప్రకృతిలోని దౌర్బల్యకాఠిన్యా దులకు పరిహారముగా ఈపదవులను సంపాదించి వారు తమ అంతరాత్మలను సమాధానపరచుకొన జూతురు. వారు చేయ గలిగినది వారు చేయకతప్పదుగదా! ఏదోఒకరకపు అడవి జంతువునకువలె వారికి ఎగబ్రాకుటకు వీలైన ఒకకొలకతప్ప వేరేమియు లేదు. అందుచే ఏదోవిధముగా వారు పైకి ఎగ బ్రాకక తప్పదు. ఒక వ్యక్తిస్వభావము అత్యంతసంపన్నమై, ఉత్తమవ్యక్తులతో నిష్కృష్టమైన సంబంధాలతడు పెట్టుకో గలిగినప్పుడు, తన ఉదాత్తమైన, మధురమైన ప్రవర్తనతో తన పరిసరాలను మధురముగా మార్చివేయజాలినప్పుడు - అభ్యర్థి నిర్ణయ సంఘాలయు, పత్రికలయు అనుగ్రహాము కొరకు అతడు ప్రాకులాడగలడా? రాజకీయవేత్తవలె ఆడంబరముతోకూడిన, అంతస్సారశూన్యమైన సంబంధాలు పెట్టుకొనుటకు అతడు ఉత్సహించగలడా? నిజమునకు– సత్య జీవనము గడపగల్గిన ఎవ్వడును దంభాచారుడుగా తయారు కాలేడు.

ఆధునికయుగలక్షణాలు స్వపరిపాలనా భావమున కనుకూలముగా నున్నవి; వ్యక్తి తాను స్వాయముగ నిర్మించు కొనిన రాజ్యాంగము ననుసరించి సత్ఫలితాలనో, దుష్ఫలితా లనో పొందును. మనము కృతకమైన నిగ్రహాధికారముల

(artificial restraints)పై ఆధారపడుచున్నను ఈ విధానము మన మనుకొనుదానికంటె కూడ ఎక్కువ శక్తిమంతము గానే పనిచేయును. అర్వాచీన చరిత్రలో ఈ లక్ష్యసాధనకై సాగిన ఉద్యమపు ముద్ర విస్పష్టముగానే కన్పించుచున్నది. ఈ ఉద్యమక్రమములో అంధావేశముతో కూడిన అవమాన కరములైన సంఘటన లెన్నో జరిగినవి. అయినను, విప్లవ కారుల దుష్ప్రవర్తన వలన విప్లవస్వభావము మాత్రము కళంకితము కాలేదు. అది పూర్తిగా నైతికశక్తి యగుటే అందుకు కారణము. చరిత్రలో ఏ రాజకీయ పక్షమున్ను ఇంతవరకు ఆ శక్తిని స్వాయత్తము చేసికొనలేదు; అట్లు చేసికొనుట సాధ్యముకూడ కాదు. ఆ సూత్రము రాజకీయ పక్షముల నుండి వ్యక్తిని వేరుపరచుటేకాక, అతనికి సంఘముతో అనుబంధము కూడ చేకూర్చును. వ్యక్తి స్వాతంత్ర్య ఆస్తి భద్రతాస్వామ్యములకంటె ఉదాత్తమైన కొన్ని స్వామ్యములను అది గుర్తించును. మానవునికి ఉద్యోగము చేయు హక్కు, విశ్వసింపబడు హక్కు, ప్రేమింపబడు హక్కు, గౌరవింపబడుహక్కుకూడ ఉన్నవి. ఒక రాజ్య మునకు ప్రాతిపదికగా 'ప్రేమశక్తి' ఎట్లు పనిచేయునో ప్రయోగము జరిగియుండలేదు. సాత్వికుడైన ప్రతి ప్రొటె స్టెంటు మతస్థునీ కొన్ని సాంఘిక సమావేశాలలో అతని విధులను నిర్వర్తింపుమని బలాత్కరించనంత మాత్రాన వ్యవస్థ అంతయు విచ్ఛిన్నమై పోవుచున్నదని మనము భావింపరాదు. అట్లే-బలప్రయోగప్రాతిపదికపై వెలసిన

ప్రభుత్వమును అంతమొందించినంతమాత్రాన రోడ్లు నిర్మితములు కావేమో అనీ, ఉత్తరాల బట్వాడా జరుగ దేమో అనీ, కృషికి ఫలితము చేతికందదేమో అనీ మనము సంశయింపరాదు. నేటి మన విధానములే స్పర్ధవలన ప్రయో జనము లేదనిపించునంత ఉత్తమములుగా ఉన్నవికదా! ఇక- అన్యోన్యమైత్రీభావవిలసితమైన జాతి ఇంతకంటె కూడ ఉత్తమ విధానాలను రూపొందించుకోగలదనుటలో ఆశ్చర్య మేమి? అయితే-పరిణామ ప్రతికూలురైన భీరువులు నేటిబల ప్రయోగసహిత వ్యవస్థకు తరుణము రాకమునుపే అర్ధాంత రముగ స్వస్తి చెప్పబడునేమో అని భయపడకుందురుగాక! మన సంకల్పములకంటె బలీయమైనది ప్రకృతి పరిణామము. దాని ననుసరించి అట్టిపని ఎన్నడూ జరుగదు. మానవులు స్వార్థపరులుగా ఉండునంత వరకు బలప్రయోగముతో కూడిన ప్రభుత్వముండియే తీరును. వారు బలప్రయోగ విధానమును పరిత్యజింప కలుగు నంతటి విశుద్ధులైనప్పుడు, పోస్టాఫీసు, రవాణా సౌకర్యాలు, వాణిజ్యము, ఆస్తి విని మయము, మ్యూజియములు, లైబ్రరీలు, కళలు, శాస్త్ర ములు మొదలైన వాటిని ఎట్లు నిర్వహించవలెనో నిర్ణ యించుకొనగలుగు వివేకము కూడ వారికి కలుగును.

మనము ప్రపంచములో చాలదిగువ అంతస్తులో బ్రదుకుచున్నాము; మనకిష్టము లేకపోయినను, బలప్రయోగ ప్రాతిపదికపై వెలసిన ప్రభుత్వాలపట్ల తప్పనిసరిగా విధేయ తను ప్రకటించుచున్నాము. ఆధ్యాత్మికదృష్టిగల అత్యుత్తమ

పౌరులుగూడ నైతికశక్తిని నమ్ముకొని వ్యవహరింపలేకున్నారు. సార్వ్యకుటుంబమువలె సమాజముకూడ కృత్రకనిగ్రహాధికారాలు లేకుండానే నిర్వహింపబడగలదని వారు భావింపలేకున్నారు; ఇందుకు కారణము: ప్రపంచఏకత్వాభావములో తగినంత విశ్వాసము వారికిలేదు. రాజ్యములోని పౌరులు జైలునుగూర్చి, ఆస్తిని ప్రభుత్వము స్వాధీనముచేసికొనుటనుగూర్చి జాపకము చేయనక్కరలేకుండానే ఇరుగుపొరుగులతో సవ్యముగా ప్రవర్తింప గలరను నమ్మకము వారికిలేదు. ఇంతకన్న విచిత్రమైనవిషయము: ఇంతవరకు ఎన్నడును ఏవ్యక్తికిని సచ్ఛీలములో తగినంత విశ్వాసము కలుగలేదు; అందుచేతనే ధర్మ, ప్రేమల ప్రాతిపదికపై రాజ్యసంస్థను పునర్నిర్మింపగల ఉత్తమ పథకమెవ్వరికిని స్ఫురింపలేదు. అట్టి పథకమును దర్శించినట్లు నటించినవారందరును నిజమునకు పాక్షికసంస్కర్తలే! ఏవోకొన్ని విషయాలలోఅయినా వారు దుష్టరాజ్యవిధాన ప్రాబల్యమును అంగీకరించినారు. కేవలము తన నైతికప్రవర్తన ఆధారముగా శాసనాధికారమును క్రమక్రమముగా త్రోసిరాజనిన ఒక్కవ్యక్తి పేరుకూడ నాకు స్ఫురణకు వచ్చుటలేదు. సంపూర్ణ ప్రతిభతోను సంపూర్ణ విశ్వాసముతోనుకూడిన ఆవిధానాలు కేవలము అవాస్తవికములైన ఆకాశహర్మ్యాలుగానే నిలచిపోయినవి. అట్టి ఊహలను ప్రకటించేవ్యక్తి అవి ఆచరణయోగ్యములని భావింప సాహసించినచో మేధావులను, మతోద్యోగులను అతడు చికాకు పరచినవాడగును. కార్యదక్షులైన పురుషులూ, అతి

కోమల స్వభావలగు స్త్రీలూ అట్టి వ్యక్తిపట్ల అసహ్య భావమును ప్రకటింపకుండనుండలేరు. అయినను-యువజనుల మనస్సులలో ఇట్టి ఉత్సాహమును ప్రేరేపించుటలో ప్రకృతి ఏమరుచుండుటలేదు. ముగ్గురు, నలుగురు మిత్రులమధ్య, ప్రేమికుల జంటలమధ్యా ఉండు ఉదాత్తమైన, సరళమైన అను బంధము వేలాది మానవులమధ్య ఉండుటకు వీలున్నదన్న దృఢవిశ్వాసము ఎట్టి విపరీతపరిస్థితులలోను చలించని మను ష్యులు ఈనాడు ఉన్నారు. 'మనుష్యులు' అని బహువచ నము నేను వాడవలెననే వాడితిని. నిజమునకు - ఇంతకు ముందే అట్టి ఒకవ్యక్తితో నేను ప్రసంగించి వచ్చినాను:

"వ్యాసావళి ద్వితీయమాలిక"

మూడవ సంపుటమునుండి.



# కళ - విమర్శ

వస్తువులకు సంకేతాలుగా పదాలు వాడుటలోనే కేవలము మనము నిమగ్నుల మైనచో సాహిత్య మొక నీరస ప్రక్రియయే కాగలదు. అయినను-సాహిత్యముయొక్క ఈ గౌణ వ్యాపారము పూర్తిగ అప్రధానమనీ నేను భావించుటలేదు. సారస్వతములోని ఇట్టి అప్రధాన వ్యాపారములనే మనము రచనా శిల్పము అని వ్యవహరించు చున్నాము. యుద్ధములో ఇనుమున కున్నంత ప్రాధాన్యము సారస్వతములో ఈ వ్యాపారముల కున్నది. కవియొక్క గాని, రచయితయొక్క గాని ప్రధానోపకరణము లేవి అని విచారించినచో ఇట్టి సాహిత్య వ్యాపారముల విలువ విస్పష్టము కాగలదు.

సర్వకళలలోను సాహిత్యకళ ఉత్తమోత్తమ మైనది; సూక్ష్మతమమైనది; అత్యద్భుతమైన ప్రభావము కలది. అంతేకాక-ఈ కళ నభ్యసించుట అత్యధికవ్యయ ప్రయాసలతో కూడిన పని. ఎంతో ప్రయాసతో ఎంతో సాధన సంపత్తి చేకూర్చుకొన్నను, అందులోచేరని అద్భుతమైన అనేక ఇతర ప్రభావాలకు కూడ రచయిత గురి యగును; యుద్ధములు, భూకంపములు, సాహిత్య పునర్జీవనోద్యమములు, చివరి తీర్పు జీసస్ చేయుననో ఏంజల్స్ చేయుననో విశ్వసించువారి వాదములు, స్వర్గ, నరక భావనలు, విజ్ఞానశాస్త్రాభి

వృద్ధి-ఇవన్నీ అతని కుంచెకు రంగులుగా ఉపయోగపడ గలవు.

ఆధునిక సమాజ పరిణామము ఒక నూతన సహృదయ వర్గమును సృష్టించుట ద్వారా సాహిత్యకళ కొక అపూర్వ లక్షణమును కల్పించినది. ప్రపంచ మంతటా ప్రత్యేక స్వామ్యాలు గల వర్గాలు క్షీణించుటతోను, సంఘములో 'తృతీయవర్గము'(Thirdestate)గా ఉండిన సామాన్య ప్రజలలో ప్రబోధము కలుగుటతోను, కార్మికుడు పాఠకుడుగాను, రచయితగాను మారుటతోను తప్పనిసరిగావిజ్ఞానులూ, మేధావులూ తమదృష్టిని ఆ సామాన్యుల వంకకు మరలించ వలసి వచ్చినది. ముఖ్యముగా ఈ దేశములో (అమెరికాలో) సామాన్యప్రజల పాఠశాలలు రెండు మూడు నూతన సహృదయ వర్గాలను సృష్టించినవి. ఒకప్పుడు కుర్చీతరగతి మాత్రమే ఉండిన మన ప్రేక్షక మందిరాలలో, నేడు గ్యాలరీ తరగతీ, నేలతరగతీ కూడా వెలసినవి.

ఎన్నటికీ వ్యవహారచ్యుతము కాని ఒక ప్రత్యేక శైలి ప్రతిజాతికీ ఉండితీరును; ఆ జాతి మాటలాడు భాషా సంప్రదాయాలకు అనుగుణమైన ఒక విధమైన పదసంవిధానమే ఆ శైలి; అందుచే, అది స్థిరముగాను పరిణామ రహితముగాను నిలిచి ఉండును. ఆర్భాటముగా మాట్లాడవలెననే వాంఛ లేకుండ కేవలము తమ భావమును ప్రకటించు తలంపుతోనే ప్రసంగించు సామాన్య ప్రజల భాషణములలో ఆ శైలిని మనము దర్శింపగలము. నాగరికు లెప్పుడూ ఆకర్ష

జేయములైన నూతనపద్ధతులపై మోజు చూపుదురు; విద్వాంసులు నూతన భాషారూపములను ఆవిష్కరింపవలెనని, లేక సృష్టింపవలెనని ఆశించి, సుప్రతిష్ఠితములయిన రూపములను పరిత్యజింతురు; ప్రత్యేకత నాశించువారు జనసామాన్యమువాడు రూపములను—అవే సరియైన రూపములైనను—వాడరు. కాని, నిజమైన అభ్యుదయ మార్గము మొరటుతనమునకు కొంచెము పైగాను, నాజూకుతనమునకు కొంచెము దిగువగాను ఉన్నది. ఆ స్థాయికి చెందిన భాషలోనే షేక్స్పియర్ తన హాస్యరచనలను సంతరించుకొన్నట్లు తోచును. గాతే (జర్మనీమహాకవి) తన పాండిత్యము చూచుకొని గాని, తన విచిత్ర భావనాశక్తి చూచుకొని గాని గర్వపడలేదు; జర్మన్ భాషలో వ్రాయుటఎట్లో తెలిసియుండుటే అతని ఆత్మవిశ్వాసమునకు ప్రబలకారణము. ఆయన కావ్యాలలో చాలాభాగము జర్మన్ జాతీయాలతో నిండిఉండి, జర్మనీగడ్డలో దృఢముగ వ్రేళ్ళు పాతుకొనిఉండుట వలన అవి అనువాదకులకు సింహస్వప్నములు; మన (అమెరికా) మహారచయితల రచనల విషయములో మనము చెప్పుకొనునట్లే వారును వాటిని అన్యభాషలలోనికి సజీవముగా అనువదించుట అసంభవమని చెప్పుదురు. "శైలియేవ్యక్తి" (Le style c'est l' homme) అన్నాడు ఫ్రెంచివిద్వాంసుడు బఫన్; "సజీవమైన జర్మన్ భాష మాట్లాడుట నేర్చుకొన్నందువలన నాకు సర్వత్ర కవిత్వము గోచరమగుచున్నది—" అన్నాడు గాతే. స్వయంకృషివల్ల గాని, కాలేజీ

లలో గాని తయారైన ఏభయ్యేసి భాషలు వచ్చిన ఎందరో బహుభాషావేత్తలను గూర్చి చదువుచున్నాడు. 'వారికి నిజముగా ఒక్క భాషఅయిన తృణ్ణముగా వచ్చినచో ఎంత బాగుండును!' అని నేననుకొందును. ఎందుచేతననగా- 'ఆంగ్లభాష నానుడి తెలిసిన పండితులను నీ వెంతమందిని ఎరుగుదువు ?' అని నన్నెవరైన ప్రశ్నించినచో అయిదుగురి పేర్లు లెక్కించుటకు గూడ నేను సదమదమై పోవుదును.

ఒక కమ్మరి, ఒక గొడ్లకాపరి తన భావములను వ్యక్తము చేయుటకు వాడునంతటి ఇమిడికగల, శక్తిమంతము లైన పదాలను రచయిత వాడనక్కర లేదా ? సంచారజాతులను గూర్చి పరిశోధన జరిపిన జార్జిబారో చరిత్ర మన మెరుగుదుము; ఆయన ఒక విషయము విస్పష్టముగా గ్రహించెను; అది; ఏ దేశమునకైనను కీలకము ఆ దేశ ప్రజా సామాన్య భాషను కరతలామలక మొనర్చుకొనుటలోనే ఇమిడిఉన్నదని. అందుచేతనే ఆయన 'రోమనీ' అను సంచారజాతి మాట్లాడు భాషను వారు సంచరించు యూరప్, ఆసియా, ఆఫ్రికాలలో వాడుకలో కనవచ్చు భిన్నరూపాలతోసహా తృణ్ణముగా అధ్యయనముచేసెను. అయినను బజారు సంభాషణలలో విన వచ్చు అనేక భాషారూపములు ముద్రణరూపము పొందుటకు వీలులేనివి. అసభ్యత లేకుండ నిశితముగా పలుకుపద్ధతి 'బర్క్' నుండి ఎవరైన అభ్యసించవలెను. రాబిలే (Rabelais - ఫ్రెంచిహాస్యరచయిత; 1490-1553), మాన్ టేన్ (Montaigne, - ఫ్రెంచితత్వవేత్త, వ్యాసరచయిత;

1533-1592)లు ఈ 'రోమనీ' భాషను ఆపోశనము పట్టినవారు; కాని, వారి రచనలు పైకి చదువుటకు వీలులేదు; అంతవరకు అవి లోపభూయిష్టములే! వాల్ట్‌విట్మన్ మన అమెరికా జాతీయ భాషలో అఖండపండితుడే! కాని, ఫైవ్‌క్లబ్బుల వాతావరణమును అధిగమించి, కుటుంబగోష్ఠులస్థాయిని అతడు అందుకోలేకపోయినాడు. బేకన్ "లండన్ శస్త్రవైద్యుల భాషను అధిగమించి రాగలిగితే" రోమనీభాష ఆయనకు కరతలామలకమై ఉండేది. లూథర్ (జర్మనీ దేశపు మతసంస్కర్త) ఇట్లనెను: "నేను మొరటు భాషలో బోధింతును; అదే అందరికీసంతృప్తినిచ్చును. హీబ్రూ, గ్రీక్, లాటిన్ భాషలలోని నాపాండిత్యమును నేను, మాపండితులమందరము సమావేశమగు తరుణములకొరకు దాచి యుంచుకొందును. ఆ సమావేశాలలో మేము పాండిత్యముతో కవాతుచేయుచు అత్యలంకారబంధురమైన ప్రసంగాలతో మా భగవంతుడే మమ్ము చూచి విస్తుపోవునట్లు చేయుదుము." శక్తిమంతుడైన రచయితకు ప్రజాభాషాపరిచయము సహజసిద్ధముగా ఉండితీరును. మిరాబో, ఛాటామ్, ఫాక్స్, బర్క్, ఆ'కన్నెల్, పాట్రిక్ హెన్రీలును, రచయితలలో స్విఫ్ట్, డీఫో, కార్లైలులును అట్టివరము గలవారు.

నోటికి తాళము వేసుకొని మౌనముగా యూరప్‌లో సంచారముచేయు అభాగ్యయాత్రిక పరంపరను చూడుడు. అక్కడి రాజుతోగాని, రైతుతోగాని వారి మాతృభాషలోనో, తమమాతృభాషలోనో, భాషించుటకువారు నోచరు.

యాత్రికజన సహాయులతోను, వసతిగృహయజమానులతోను కాలక్షేపము చేయవలసినదుర్గతితప్పించుకోలేరు. ప్రజలందరితో కలసిపోయి తిరుగగల అదృష్టము వారికిలేదుగదా! అంతకంటె స్వదేశమున స్వగృహమున కూర్చుండి సాధింపనగు మరొక మంచిలక్ష్యము నెంచుకొని వారు సమగ్రవిస్పష్ట పరిశోధన జరుపుటమంచిది; అప్పుడు వారికి ఉత్సాహకరములైన వాదోపవాదముల వలనను, గృహగ్రంథాలయములోని వివిధ గ్రంథాలను సంప్రదించుటవలనను కలిగెడిఆనందమైనను లభింపగలదు.

సామాన్యులస్థాయిలో మాటలాడుచు, విజ్ఞులస్థాయిలో ఆలోచింపవలెను. అద్భుతమైన భావనాశక్తితోను, ఆజన్మభోగుల ఉత్తమాభిరుచులతోను ప్లేటో ఈ లక్ష్యము సాధింపగలిగెను. 'జోవ్' (గ్రీక్ దేవత) భూలోకమున కవతరించినచో నిశ్చయముగా అతడు ప్లేటో శైలిలోనేమాట్లాడియుండువాడు. తన 'అకాడమీ' (కళాపరిషత్తు) లోని అత్యంత నాగరక వాతావరణములోనికి హీనజాతివాడగు సోక్రటీసునకు ప్లేటో ప్రవేశము కల్పించినాడు. సోక్రటీసు చేయు తలతిక్క ప్రసంగాలవలనను, అతని కుండబొచ్చెలవలనను, అతనివంట, మాంసము తరుగుకొను కత్తి, అతని బండికిఉన్న చక్రాలు మొదలైనవాటివలనను ఆడంబరముతోకూడిన ఆ పరిషద్వాతావరణపు విసుగుదలను తగ్గించుటకై ప్లేటో అట్లు చేసెను. మొగము మొత్తిపోవు పరిషద్వాతావరణమును ఆస్వాద్యముగా చేయుటకుకూడ సోక్రటీస్ యొక్క మొరటు

తనమును క్రమముగా ప్లేటో వాడుకొనెను. ఏయేవిధానాల ద్వారాపరిమితస్త్ర సామాన్యప్రజలకు ఉపయోగకారి కాగలదో అక్కడ అందరకూ తెలియును; నిర్దుష్టమైన తమ ప్రసంగాల లోనికి బజారుభాషలోని జీవమును దిగుమతి చేయగల నేర్పు అక్కడ సమర్థవక్తలకందరకూ ఉండెను. నేనొక సంఘటనను గూర్చి విన్నాను; ఒకప్పుడు ఒక గొప్పబ్యాంకు అధ్యక్షుడు రిటైర్ అయిన బ్యాంకు ఉద్యోగుల సమావేశములో తనపార్టీ ఘనతను, ప్రభుత్వఘనతను వివరించుచు ఉత్సాహముగా ప్రసంగించుచుండెను. అందరును మౌనముగా వినుచుండిరి; అంతలో మెథడిస్టు మతశాఖకు చెందిన ఒక గంభీరవ్యక్తి "ఫిడేల్ కమానులు" (గాలిమూటలు) అని అరచెను. అక్కడ సంగీతప్రసక్తిగాని, ఫిడేల్ ప్రసక్తిగాని లేనందువలన ఆ పదప్రయోగముయొక్క వాస్తవికార్థమును నిర్ణయించుట కష్టమేఅయినప్పటికీ, ఆబ్యాంకు అధ్యక్షుడుతప్ప అక్కడఉన్న అందరూ వెంటనే ఆశ్చర్యామోదములతో హర్షధ్వనులు చేసిరట!

దిగువ తరగతులవారి శైలి మాత్రమేకాదు; అంత కంటె దిగువ తరగతికి చెందిన కొన్ని విచిత్ర విశేషణాలు కూడా మన తార్కికయుక్తులకన్న ఎంతో విలువైనవి; upstart (పురోగామి; నడుమంతరపు సిరి పట్టినవాడు), dab (ఒక చేప; నిపుణుడు), cock-ney (దుర్మార్గుడు; ఆడంగి రేకులమనిషి), Prig (మనిషి; స్వార్థపరుడు), granny (అవ్వ; చాదస్తపు మనిషి), lubber (వికృతాకారపు

మనిషి, బడుద్ధాయి), Puppy (కుక్కపిల్ల; మూర్ఖయువకుడు), Peacock (నెమలి, వన్నెల విసనకఱ్ఱ), "A Cocktail House of Commons" (నాటుగుత్త్రాల సభ! అనాగరక సభ్యులు గల కామన్స్ సభ) మొదలైన విశేషణాలు ఇట్టివే! డాక్టర్ ఆస్గుడ్ అను సుప్రసిద్ధ మతాచార్యుడు ఒక యువ మతప్రచారకుని బోధన విని "Paty cake" (చవకబారు రొట్టె) అని అవహేళన చేయుట నే నెరుగుదును. ఒక Sans - culottes (దిగంబరుడు; ఫ్రెంచిభూస్వాములు విప్లవసైన్యములోని కార్మికులకు పెట్టినమారు పేరు) వెర్సేల్స్లో "Let our little Mother Mirabeau speak" (మా చిట్టితల్లి మీరాబో (విప్లవకాలప్రజానేత బ్రియల్ మీరాబో భార్య)ను మాట్లాడనివ్వండి) అని అరచినాడట! బజారు భాషలో bosh (నిస్సార ప్రసంగము), gammon (హంబగ్), gas (ఊక దంపుడు) మొదలైన మాటలు ఎంత శక్తిమంతము లైనవో మన మెరుగుదుము. సామాన్యజనులు వాడుకొనే చిన్న చిన్న శాక్సన్ పదాలు లాటిన్ పదాలకంటె ఎంతో మంచివి. బజారుభాష సర్వదా పటిష్ఠమైనదే! మన వ్యాకరణ సూత్రాలకు విరుద్ధమే అయినా చిన్నపిల్లలు చేయు 'నఞ్' ద్వయ ప్రయోగము (no shoes, no money, no nothing) నాకు అసూయ కలిగించును; శబ్దార్భాటపు కృత్రిమత్వముతో గింగురులెత్తుచున్న నా చెవులకు అవి ఒక విధమైన గిలిగింత చేకూర్చినట్లుండును.

బహువిధములైన ప్రశ్నలలో ప్రతిభావంతముగ తిట్టు ప్రక్రియకూడ కొందరికి ఉండును. నేనొక కవిని ఎరుగుదును; ఆయనకు ప్రకృతి ఇట్టి ప్రతిభను పుష్కలముగ సమకూర్చినది. ఆయన కవిత్వ మంతటిలోను చెప్పుకోదగ్గది ఆయన వ్రాసిన తిట్టుకవిత్వమే! "అట్టి శక్తి ఎంతఎక్కువ అయిన అంత చెరుపే" అని మీరు అనవచ్చును. కాని, ఆ కవిత్వము నాకు వథెక్ *సేకరించిన రాకాసి మానవుల కొనతేరి తీర్చి నట్లున్న మహాప్రాణులను, నిగనిగలాడు కొమ్ములును జ్ఞప్తికి తెచ్చును. ఏయూరప్ యాత్రికుడు ఫాల్కన్ డేగ వేగమును గురించీ, 'సియామీమజాటో' అని పిలువబడు ఫ్రెంచి దేశపు గుఱ్ఱపుబగ్గీ కుర్రవాళ్ళయు, ఇటలీకర్షక యువతులయు శక్తిని గురించీ, ఇంగ్లండులో చేతిబండీలాగే వారి (draymen) తిట్లలోని తీవ్రతను గురించీ వినకుండనుండును? నాకొక సంఘటన జ్ఞాపకమున్నది. ఈ తిట్టువిద్యలో ఆరి తేరిన ఒక పెద్దమనిషి ఒకప్పుడు నార్త్‌స్ట్రీట్ నుంచి కేంబ్రిడ్జి వచ్చి, యువవిమర్శకులను కొందరిని ఒక కాలేజి హాలులో సమావేశపరచి, వారికి ఉపన్యసించినాడు. ఆ వక్త ప్రదర్శించిన కోపము అతికళాత్మకముగాను, సారవంతముగాను ఉండుటవలన శ్రోతలు ఆ ఉపన్యాసమునకు నోట్స్ తీసు

---

* విలియమ్ బెక్‌ఫర్డ్ రచించిన సుప్రసిద్ధ కల్పిత గాథలో నాయకుడు; శక్తిమంతుడై, విపరీతాశయాలు పెంచుకొన్న ఒక మహమ్మదీయ చక్రవర్తి.

కొనుటే కాక, తమ గణితశాస్త్రపు క్లాసునుకూడా ఎగ గొట్టి అక్కడే ఉండిపోయినారు.

మానవ ప్రవృత్తిలోని చక్రభ్రమణములు విచిత్రముగా నుండును. మనము 'శని' (Satan) యన్న భీతావహము చెందు వాతావరణములోనే విద్యాభ్యాసము చేసినాము; కాని గాతే మనమందరము ఆ 'శని' పేరు ఉచ్చరింపవలెననే కోరుచుందు మన్నాడు. 'బర్న్స్' కవి శనిపై జాలిచెంది అతని సంస్కార ణకై ప్రగాఢమైన అభిలాషనుకూడవ్యక్తముచేసెను.

చాల అన్యాయాలకు గురిఅయినవ్యక్తిగా 'శని' ని భావించుచు, గుప్తముగా అతని నర్చించు ఒక జాతినే జార్జ్ శాండ్ తానెరుగుదునన్నాడు. భాషాశాస్త్రముదృష్ట్యా ఈ పదము ఉత్సుకతను కలిగింపజాలినది. పదములు మనకు వేరు విధముగా ఉపయోగపడుచునే వాటి తాత్త్వికార్థమును గోల్పోవనుటకు ఈపదమొక నిదర్శనము. తత్త్వశాస్త్రరీత్యా Devil (దెయ్యము) అనునది పూర్తిఅభావమును, అసత్య మును, శూన్యమును సూచించుపదము. కాని, ప్రజలమనస్సు లలో 'Devil' ఒక దుష్టవ్యక్తి. అయినప్పటికి మన రచన లలో మొదటి అర్థముకూడ వ్యక్తమగును. "The Devil a monk was he" అనగా అతడు సన్యాసి కాడు అని అర్థము. ఇట్లే "The Devil you did" అన్నచో 'నీవుచేయ లేదు' అని అర్థము. ప్రకృతి విజానము మనకు

* 'ఎరిబస్' లోకమువంటి దేవతాభూములను గూర్చి, 'ప్రళయ రాత్రి' (Night of chaos) వంటి అసుర వేళలను గూర్చి కూడా తెలుపును........ గోతే 'వాల్పర్గిస్నాక్ట్'♦ పండుగకొరకు ప్రకృతిలోను, మానవులలోను కానవచ్చు అసురలక్షణముల వివరములను సేకరించుటకుపూనుకొని, ఆ ఉత్సవానంతరము కూడ ఉత్సాహకరమైన ఆపనిని కొనసాగించి, తన అతిథికొకనికి తాను సేకరించిన వివరాలతోను, చిత్రాలతోను నిండిన ఆ 'వాల్పర్గిస్' సంచి లేక 'అకెరోన్షియన్' సంచి ('అకెరోన్' దయ్యముల నెలవు అగు 'హేడ్స్'లోని ఒకనది) చూపించి, "ఆ సంచి లోనికి నేను ప్రవేశించినచో దగ్ధుడనై పోదునని నాకుభయము", అని ఆఅతిథితో అనెనట! డాంటే తన అనుభవమును స్వర్గ, నరకములలోనికి ప్రసరింపజేయగల ఉదాత్తమైన సాధారణ శైలిలోను, ఇమిడికతో కూడిన శిల్పములోను కూడ సిద్ధహస్తుడు.

రచనాశిల్పములోని (Rhetoric) మరొక ప్రధానాంశము ఇమిడిక; అనగా అనావశ్యక విషయాలను పరిహరించు నేర్పు; ఇదే గ్రీక్ పురాణకవి హీసియాడ్ పద్యాలను అంతఅందముగా చేసిన గుణము;

---

* గ్రీక్ పురాణాలలోని ఒక అధోలోకదేవత. అతడు 'నిశా' పతి. 'నిశా' గర్భమున కాంతిని, పగటిని సృజించినవాడు.

♦ సెయింట్ వాల్ పర్గాదినము. మే 1 వ తేదీని వచ్చును. ఆనాటిరాత్రి కొండలమీద మంత్రకత్తెలందరూ సమావేశమగుదురను నమ్మకము గలదు.

"మూర్ఖతార! ఎఱుంగరు పూర్ణమూర్తి
కన్న నర్థ మూర్తియె సదా మిన్నయనుచు"

(Fools they did not know that half was better than the whole)

ఫ్రెంచిభాషలో ఒక లోకోక్తి ఉన్నది; 'విసుగు పుట్టించు కీలకము వివరించి చెప్పుట' అని. దీనినే మరొక విధముగా చెప్పినచో, విసుగుపుట్టించకుండ ఉండుటకు విషయమును, "స్పృశించి వదలివేయవలెను." ఒక వక్త పాటించు జాగాలూ, మూకాభినయాలూ కూడా అతని పలుకులతో సమానముగా శక్తిమంతము లైనవి. కవి చెప్పకుండ వదలు భాగము చెప్పిన భాగమునకు దీప్తిని కలిగించును. సమర్థుడైన కవి చేతులలో అది ఎన్నటికీ వంధ్యాత్వమును పొందదు. మంచిరచయిత మాటల ఎన్నికలో అత్యంత జాగరూకుడై ఉండవలెను; పదములలో భావమును అతిసాంద్రముగ దట్టించినప్పటికీ విలువైన ఆ పదముల మధ్య అశ్వసహితమైన ఒక రథము మలుపుదిరుగుటకు వీలైనంత ఎడముకూడ ఉండవలెను. అమెరికాలో ఈక్లుప్తీకరణము శ్రుతిమించు ప్రమాదము లేదు; చేతగానితనముచేత వచ్చు అస్పష్టతతో కూడిన సంక్షిప్తత మంచిది కాదు; కేవలము అనావశ్యకభాగములను మాత్రమే పరిహరించవలెను. హిందూపురాణాలలో 'విశ్వకర్మ' సూర్యబింబమును తన ముందర దిమ్మమీద పెట్టుకొని దానిలో కొంతభాగమును బాడిసెతో చెక్కివేసెననీ, అట్లు చెక్కి

చెక్కు మొనటనున్న బింబములో ఎనిమిదవవంతు మిగిల్చె ననే ఒక కథ ఉన్నది. అంతకంటె ఎక్కువ కాంతిని సూర్యుని నుండి వేరుచేయుటకు వీలుపడలేదు.

శిల్పకళలో ద్రవ్యము నెంత ఎక్కువ తగ్గింతుమో శిల్ప ఖండముయొక్క సౌందర్యము అంతగా ఇనుమడించును. అట్లే సాహిత్యకళలో వచనమను గోడను కూల్చి ఆ శక్తి అంతయు ఉండునట్లు దాని స్థానములో కవిత్వమను స్తంభము లను నిర్మింతుము. ఒక రచనను మనము పైకి చదివినచో దానిలోని అనావశ్యక వాక్యము లేవో బోధపడును. వాటిని తొలగించి మరల చదివినచో ఏవి అనావశ్యక పద ములో స్ఫురించును. రంగురంగుల విలువైన రాళ్లు తాప టముచేసిన రాతిపలకలో మధ్యమధ్య నిలచిఉండే గులక రాళ్ళవంటి వవి. దృఢనిశ్చయముతో పూనుకొన్నచో-ఏదో అర్థమున్నట్లనిపించుచు, ఏ అరమూ ఉండని సాధారణ పద సముదాయాలను పూర్తిగా మనము తొలగించివేయగలము. ''నన్ను అపార్థముచేసికొనవద్దని ప్రార్థించుచున్నాను''-వంటి మాటలు ఎన్నడూ వ్రాయరాదు. ఒక్క సందర్భములో మాత్రమే అట్లు వ్రాయుట ఉచితముగా ఉండును. మన రచనలోని మంచిఅర్థములే వారు గ్రహించి ఊరకుండరేమో అనే భయము మనకు ఉన్నప్పుడూ, దానిలోని చెడ్డ అర్థమును వారిదృష్టికి తేవలెనని మనము కోరినప్పుడూ అట్లు వ్రాయవచ్చును. డీన్ స్విఫ్ట్ (ప్రసిద్ధాంగ్ల వచన రచయిత) వంటి మంచి రచయితకు పాఠకులు తనను చెడ్డవాడనుకొను

నట్లు వ్రాయు అధికార మున్నది గాని, చెడ్డరచయితకు తనను అందరూ మంచివాడనుకొనునట్లు వ్రాయు హక్కు లేదు.

మన విశ్వవిద్యాలయపట్టభద్రుల కొరకు మన (అమెరికా) విద్యాశాఖవారు ఒక కళాశాల నెందుకు నడుప కూడదా అని చాలసార్లు అనుకొనుచుందును. అట్టి కళా శాలలో మన పత్రికారచయితలూ, కాంగ్రెస్ (పార్లమెంట్) సభ్యులూ, గ్రంథకర్తలూ చేరి మనము వాడు భాషలో వీలైనంతవరకు పదాలను తగ్గించు నేర్పు నేర్చుకొను అవ కాశ ముండవలెను. ఇంతేకాక మన విద్యాశాఖవారు పత్రి కలలో నిత్యమూ కనవచ్చు అసాధువులైన అమెరికన్ పదప్రయోగాల పట్టికను గజెట్‌లో ప్రచురించవలెను. ఇట్టి ప్రయోగాలలో కొన్ని మరీకర్ణకఠోరములుగా ఉండును. 'Some' (కొన్ని, కొంత) అను పదమును అవ్యయముగా వాడుట (ఉదా:—"reeled some") Considerable (చెప్పుకో దగినంత) అను మాటను అవ్యయముగా వాడుట, much (మరింత) అను మాటకు బదులు 'Quite a number' (అసంఖ్యాకముగా) అని వాడుట, 'bad' (చెడ్డ) అను అర్థ ములో 'slim' (నీచమైన) పదప్రయోగము, 'వ్రాయబడినది' అను అర్థమిచ్చు 'graphic' అను విశేషణమును 'వర్ణనాత్మక మైన' అను అర్థములోవాడుట (Minerva's graphic thread) మొదలగు ప్రయోగా లట్టివి. రాండాల్ అనే కాంగ్రెస్ సభ్యు డొకడు కామన్స్ సభకు సంబంధించిన ఒక కమిటీ

ముఁమ "ఒక ప్రశ్నను ముగించుటలో అమెరికా పద్ధతి" ని గురించి సాక్ష్య మిచ్చుచు ఇట్లనెను:- "The one-hour-rule worked well. it made the dedate short and graphic" (ప్రతిసభ్యుడూ ఒక గంటకు మించి మాట్లాడరాదనే నియమము సక్రమముగా అమలు జరుగుచున్నది; దీనివలన చర్చ సంక్షిప్తముగాను, graphic (వర్ణనాత్మక మను అర్థములో) గాను సాగుచున్నది). ఒక ప్రసంగమును గూర్చి అది వ్రాసినట్లున్న దనుటకంటె నికృష్టమైన ప్రశంస మరియొకటి ఉండబోదు.

'Development' అను పదమును అసలు వాడకుండుట మంచిది, అట్లే 'Fero'-తో ఆరంభమగు పదముల కుటుంబము విషయమైకూడ చాల జాగరూకత వహించవలెను. ఇంకా ఇట్టి ప్రమాదకరములైన పదాలు: display, improvement, Peruse, circumstances, 'begin' అను అర్థములో Commence అను పదము. గ్రామ్యరూపాలుగా గజెట్‌లో ప్రకటించవలసిన ప్రయోగాలు: ఒక చిన్న భాగముఅను అర్థములో moiety (సగము) "nothing would answer but," "there is none but what;" "There being scarce a person of any note in England but what some time or other paid a visit or sent a present to our lady of Walsingham" (బిషప్ పార్క్స్); "might have to go"; "I have been to Europe;" "in our midst"; "It is considerable of a compliment"; "under considerable of a cloud"; remainder అనుపదమునకు బదులుగా balance (spent the balance of his life); "as a general

thing": "After all". Lie, lay అనుపదములను, sit, set అను పదములను, shall, will అను మాటలను తారుమారుచేసి వాడుట కూడ ఈ శ్రేణిలోకే వచ్చును.

కొన్ని పదాలను పొరపాటు అర్థములలో వాడుట వలన ఆపదాలు అట్లు వాడిన వ్యక్తులకు ఉపనామములుగా ఏర్పడుటకూడ కద్దు. 'పిరమిడ్'లాంబర్ట్, 'ఫైనాలిటీ'రసెల్, 'హ్యూమానిటీ' మార్టిన్, 'హొరైజన్' టర్నర్ అను పేరు లిట్టివే!

ప్రతి యుగములోను కొన్నిపదములిట్లు దురర్థముల పాలగును. ప్రస్తుతయుగములో మనము standpoint, myth, subjective, the good and the true, the cause అనుపదాలను ఇట్లు దురర్థాలలో వాడుచున్నాము.

యువరచయితలను ప్రలోభపెట్టు asphodel, harbinger chalice, flamboyant, golden, diamond, amethyst, opel మొదలైన రత్నాలపేర్లు, carcanet, diademవంటిఆడంబరపు పదాలపట్టికనుగూడ తయారుచేయించవలెను.

రచనాశిల్పములోని ఈప్రాతిపదిక సూత్రాలకు అగ్ర రచయితలందరిలోను అద్భుతమైన ఉదాహరణలు కనుపించును; వారి రచనలు అంత ఆహ్లాదకరములగుటకుగూడ ఈసూత్రములను పాటించుటే ముఖ్యహేతువు. షేక్స్పియర్ రచనలను వాటిలోనిఅద్భుతకవితాశక్తికొరకుకాకపోయినను, ఈ ఆయుధాలను వాడుటలోని అతని కౌశలమును పరిశీ

లించుటకైనను అందరూ అధ్యయనము చేయవలెను. అతని వలె ఈ 'సాధారణశైలి' (low style) ని న్వాయత్తము చేసి కొన్న రచయిత మరియొకడు లేడు. అందుకే ఎవ్వరునూ సురక్షితముగా అంత ఎత్తులకు ఎగురలేదు. ఇట్లనుటవలన అతడు వినోదప్రియుడనీ, హాసముతోను పాశవికాహ్లాదము తోను మార్మ్రోగుచుండు బజారును ఫాల్‌స్టాఫ్, టచ్‌స్టోన్, ట్రిన్‌క్యూలో మొదలైన విదూషకులతోసహా యథాతథ ముగా రంగముపై కెక్కించెననీ కాదు నాఅభిప్రాయము. నాటకనిర్వహణలోను, నాయకుల సంభాషణములలోను పై తరగతులవారికీ క్రిందితరగతులవారికీ సాధారణమైనట్టియు, ఎక్కువమందికి అర్థమగునట్టియు శైలి నతడు వాడుకచేయు ననియే నేను చెప్పదలచుకొన్నది. అతడు ప్రగాఢమైన అను భవశాలి అగుటచేత అతని 'సానెట్'లు (పద్యములు) కూడ 'బ్యాంకర్ల పత్రిక' (Banker's gazette) అంత వాస్తవికములు గాను, సత్యసన్నిహితములుగాను ఉండును. మూర్తికల్పనలో అంగప్రత్యంగాలను తీర్చుటలో అతనిని నిగ్రహించు సూత్ర మొక్కటే! అదివిశ్వజనీనత. ఆ విశ్వజనీనతాభావమే అతని యందు పక్షపాతముగాని, నిశ్చితాభిప్రాయాలుగాని అసంభ వములగునట్లుచేసినది. అతని సమదృష్టి సూర్యుని కిరణము వంటిది.

అతని హాస్యముకూడ అతని గంభీర రచన అంతటి వివేకవంతమైనది; స్తిమితచిత్తములో పునాదులుగల ఉత్తమ హాస్యమది. అతని కవితాధిదేవత సంపూర్ణముగా నీతిమంతు

రాలు. ప్రకృతిలోవలె అతని రచనలలో కనిపించు సాధారణ, అసాధారణ తత్త్వముల సంమిశ్రణమునకు నేను ముగ్ధుడనగుదును. షేక్స్పియర్ తన మొదటి గ్రంథము రచించు నాటికి వెయ్యేండ్ల వయస్సు నిండిన వ్యక్తివలె కనిపించును; అతని ఊహ మన కంత సుపరిచితముగా నుండును; అతని మాటల కూర్పు అటుపైని ఒక సామెతగా చలామణీ అగుట అట్లుంచి, అప్పటికే సామెతగా స్థిరపడినదేమో అనిపించునంతగా సాంద్రముగా నుండును. వేయిసంవత్సరాలనగా ఎంత? అతని ఊహాల గమనవేగమును కొంచెము హెచ్చించిన చాలును; ఆ వేయి యేండ్లవృత్తమున్ను అతని మనోనేత్రము ముందు సుస్పష్టమగును. అతని 'మగ్గము' లోని పల్లు మొదలైన భాగములు ఇతరుల మగ్గాలలో కంటె ఎక్కువ దృఢమైనవి; ఇతరులు ఒక గజముగుడ్డ నేయుసరికి అతడు నూరు గజముల గుడ్డ నేయగలడు. భావప్రకటన కౌశలమే షేక్స్పియర్‌లోని విశిష్టత. మనకాలములో కంటె అతని కాలములోని విషయములు అధికవర్ణనీయము లెంత మాత్రము కావు. ఆ కాలములోనే అత దుద్భవించుటకు ఆవశ్యకమైన విశిష్టలక్షణములు కూడ ఆ కాలమునకు లేవు. అయినను ఒకటి మాత్రము నిజము; అద్భుతమైన మూర్తి కల్పనా నిపుణుడు, భావప్రకటన చతురుడు ఆ కాలములో పుట్టెను; ఏ కాలములోను అతనిని అధిగమించగల కవి 'నభూతో, నభవిష్యతి', యాదృచ్ఛికముగా వచ్చి, అతడు

తన కాలమును, ఆనాటి జీవితమును అత్యంత దీప్తిమంతము లుగా చేసిపోయెను.

ఫ్రెంచివారి మనస్సు అంత దుర్బలముగా ఉండి వారు అంత ఆవేశముతో అవకతవకగా ప్రవర్తించుచుండుటకు హేతువు వారు షేక్స్పియర్ రచనలు చదువకపోవుటే అనీ, షేక్స్పియర్ రచనలనూ, బైబిలునూ అధ్యయనము చేయు ఇంగ్లీషువారును, జర్మనులును అద్భుత పురోగమనము సాధించుచున్నారనీ నా మిత్రుడు డొకడు అనుచుండెడివాడు. ఒక్క షేక్స్పియర్ ఒక జాతి సంస్కృతిని యుగాల తరబడి పోషించుటకు చాలును. చీనావారు ఇంత దీర్ఘకాలము వారి కన్ఫ్యూషియన్, మెన్షియన్‌లతోను, అరబ్బులు వారి మహమ్మదు ప్రవక్తతోను, స్కాండినేవియనులు వారి స్నొరీ స్టర్లూసన్ (1179-1241) తోను బ్రతుకుచుండుట లేదా! బ్రిటిష్‌దీవులు ఇంతకంటె పెద్దవిగా ఉండి, యూరప్ ఖండములోని గందరగోళపు పరిస్థితులకు సుదూరముగా ఉండుటకు వీలుగా డోవర్ జలసంధి ఇంతకంటె విశాలమై ఉండినచో-ఇంగ్లీషువారు మరికొన్ని యుగాలపాటు-ఎడారుల లోని ఒంటెలు ఆహారము దొరకని దీర్ఘవ్యవధానములలో తమ మూపురములమీద బ్రతుకునట్లు-షేక్స్పియర్ కవి రచనలమీదనే బ్రతుకుచుండెడివారేమో!

హోటళ్ళ (bar-rooms) లో వినవచ్చు సాధారణ భాషాశైలిని- ఏ పండితునిచేతను సృజింపబడని పదములు,

సమాసములతో కూడిన శైలిని- సాహిత్యములోనికి ప్రవేశ పెట్టిన ఘనత 'మాంటేన్' (ఫ్రెంచితత్త్వవేత్త; వ్యాసరచయిత-1533-1592)కే దక్కవలసియున్నది. ఆ శైలిలోని పదములు, సమాసములు బజారుసంభాషణలలోను, యుద్ధనినాదాలలోను స్వయముగా రూపొందినవి; పడవకళాసు నుండి, రైతునుండి, భూస్వామినుండి వెలువడిన శైలిఅది; నిరంతరము సముద్రతరంగాఘాతములచే నునుపుదేరిన గులకరాళ్ళ వలె పనిపాటలవేళల సాధారణజనము నోళ్ళలో నలిగి నలిగి ఆ శైలి స్వచ్ఛముగను, స్పష్టార్థనివేదకముగను తయారైనది. మానవుని స్వీయచరిత్రాత్మక విశేషములు గ్రంథముల విలువను ఇనుమడింపజేయును. కాని, వ్యాసములనుండి కేవలము అశ్వమును బహిష్కరించుట సాధ్యముకానిపని; ఆ అశ్వముతోపాటు ఆశ్వికుడును బహిష్కృతుడగును. (అనగా-సాధారణమానవుల శైలిలోకాక మరొక శైలిలో ఆ సాధారణ మానవులనుగూర్చి వ్రాయుట సాధ్యముకానిపని.)

సాధారణశైలి వాడిన రచయితలకు హెరిక్ (రాబర్ట్ హెరిక్; ఇంగ్లీషుకవి(-1591-1674) ప్రముఖనిదర్శనము. ఆంగ్ల రచయితలలోని నవ్యతకు కూడ అతడు మంచి ఉదాహరణము. నిజమునకు లాటిమర్ (ఆంగ్లసంస్కర్త; ఆత్మత్యాగి-1485-1555) చాసర్ (ఆంగ్లకవి-1340-1400)లు కూడ అట్టివారే! అసలు బైబిల్ గ్రంథమే అట్టి శైలిలో వ్రాయబడినది. హెరిక్ కవికి తన చుట్టును సర్వత్ర కవితావస్తువు గోచరించినది. తాను నిలచిన స్థలము, తన ఇల్లు,

సరుకులకొట్టు, ధాన్యపు గాదె, కోళ్ళదొడ్డి, తన గ్రామము, పొరుగువారి బాతాఖానీ, నీలాపనిందలు-అన్నీ అతని కవితకు విషయములే! అప్రయాసముగ వస్తువును సేకరించుకొను టలో మాంటేన్‌తో ఇతనిని పోల్చవచ్చును. తాను దేనిని గూర్చి చెప్పుచున్నాడో దాని నతడు పూర్తిగా ఎరుగును; ఒక ముఖ్య రహస్యము విషయమువ కొంతవరకు చెప్పి అసలువిషయము చెప్పకుండ అతడు ఊరుకొనడు. యథాతథ ముగ సర్వము చెప్పును. ఆ చెప్పుటలో తన స్థాయిని తాను నిలబెట్టుకొనును. అందుకే అతని రచనలలో అంతటి బల ముండును; ఆ బలముకూడ ప్రయత్నసాధితముగ కాక సహజ సిద్ధమైనదిగా కనిపించును. అతడు తా నెరిగిన వస్తువులనే గ్రహించును. ఎట్టిఆర్భాటము లేకుండ అతిసరళముగా వాటిని గ్రహించును, జర్మనులు 'గాతే' రచనలలో అప్రయత్నసిద్ధముగ స్ఫురించు గాంభీర్యమును మెచ్చుకొందురు; హెరిక్ రచనల లోని సుగుణము-నిరాడంబరత, ధైర్యముతో కూడిన భావ ప్రకటనము. అప్పుడప్పుడు బరువైన వాక్యముల తీరుకూడా అతని రచనలో తోచుచుండును. ఉదాత్తమైన, జాతీయ ములతో నిండిన, సర్వసమగ్రము నిరాడంబరము అయిన ఒక ఆంగ్లభాషా శైలి అతని కున్నది; అతని కున్నదని అత డెరుగును. ఆ శైలి సహాయముననే చెక్కుచెదరకుండ అనా యాసముగ అతడు సుకుమారము, మధురము అయిన భావ కవిత్వపు (Lyrical poetry) ఎత్తులకు ఎగురగలడు; మోటు దనముతో కూడిన నిశితపరిహాస రచనల అంతస్తులకు దిగి

పోనూగలడు. ఈ భాషాహృదయ సమ్యగ్గ్రహణమును వెన్నంటియే ఎప్పుడును కీర్తి కాంతా పరిష్వంగభోగ ముండును. ఈ ఉత్తమ గుణములో పైని చెప్పిన మహామహులతో సరితూగగల ఒక కళావేత్త మనకు గూడ నున్నాడు.

బైరన్‌లోవలె కార్లైల్‌లోగూడ విషయముకంటె రచనాశిల్పము మనసెక్కువగా ఆకర్షించును. అతని లో సునిశిత మేధాశక్తికంటె ఉదాత్తమానవత్వము ఎక్కువ కనిపించును; అందుకే అతడు నిరంతరము బలమైన విసురులు విసురుచుండును. అతని ప్రతివాక్యము వెనుక బుద్ధివైభవము కంటె సచ్ఛీలశోభ ఎక్కువ ప్రకాశించుచుండును. ఈవిషయములో అతనిలో శామ్యుయల్ జాన్సన్ పోలికలు దండిగా కనిపించును. కార్లైల్ చేసిన అత్యుత్తమసేవ రచనాశిల్పమునకే చేసెను. అతని గ్రంథములలో దుష్టరచనా సంప్రదాయములకన్నిటికి తిలోదకములీయబడెను. రచయిత మనస్సుకు మనకు మధ్య ఏఅడ్డంకు నుండదు; అతడు యథేచ్ఛగా మాటలాడును; ఒకప్పుడు బిగ్గరగను, మరొకప్పుడు నెమ్మదిగను, ఒకప్పుడు మాటమాటపై నొత్తుచును, మరొకప్పుడు హీనస్వరముతోను పలుకును; అంతలో గోడలు ప్రతిధ్వనులీనునట్లు నవ్వును; తిరిగి అంతలో యథాస్థితికివచ్చి వ్యంగ్యముగ మాటలాడుటో, కనుబొమలెగురవేయుటో చేయును. ప్రభంజనముయొక్క గుణములను ఇంతగా అలవరచుకొన్న రచయిత మరొకడు కనుపింపడు.

ఒకవస్తువును అనుకరణచేయువిధానములతో వ్యక్తమైన కృషిగల కార్లైల్ ఆవస్తువు నిర్మాతతో ఇంచుమించు సమాన మైన ఘనతకు అర్హుడు. పిరమిడ్ (ఈజిప్టులోని రాజసమాధి) మీాది సుప్రసిద్ధమైన ఈక్రింది శాసనమును చదువునప్పుడు నాకు కార్లైల్ జ్ఞాపకమునకు వచ్చును.

"మహారాజునైన నేను ఈ పిరమిడ్‌ను నిర్మించినాను. దీనిని నిర్మించినప్పుడు దీనిని నేను శాటిన్ సిల్కు వస్త్రిలతో కప్పినాను. నాతరువాత వచ్చువాడెవడైన నాతో సమానుడ నని చెప్పుకొనగలిగినచో దీనిని చాపలతో కప్పవచ్చును."

కార్లైల్ చెప్పినమాట సామెతగా చలామణీ అగును. దానిని మరొకవిధముగా మరొకడెవ్వడూ చెప్పలేడు. కార్లైల్ అనంతరము వెనుకటి ఊకదంపుడు ప్యూరిటన్ పద్ధతిలో వ్రాసిన గ్రంథములు చదువుట దుర్భరమైనది. సాహిత్యములో కార్లైల్ తెచ్చిన విప్లవము నేడు చిత్రజగత్తులో మూాడు పరి పరిమాణాల చిత్రాలు తెచ్చుచున్న పరిణామములవంటిది. చరిత్రను రసవంతముగు తీరులో వ్రాయుట ఇంకను జరుగవల సియే యున్నది.

మూాడునెలలక్రితము 'ఫ్రీడ్రిక్ చరిత్ర' అనే గ్రంథ మొకటి మనదేశము (అమెరికా)లోకి వచ్చినది. ఇంతవరకు అంత అద్భుతముమైన తెలివితేటలతో వ్రాయబడినపుస్తకము మరొకటి రాలేదు. ఆ పుస్తకము చదివిన ఎవడైనను— ఆంగ్ల ప్రజలండియూ ఆగ్రంథరచయితను ఐకకంఠ్యముగా అభినందించి

'ఓక్' చెట్టు ఆకులతో అల్లిన కిరీటము నతని తలకు తొడిగి తద్ద్వారా, అట్టి గొప్పతలకాయ తమ జాతిలో వెలసినందుకు తమ ఆహ్లాదామోదాలు ప్రకటింతురని; సానుభూతీ, విశేష గ్రంథపఠనాసక్తిగల అమెరికా దేశము ఆపుస్తకము చదివి ఆంగ్లేయులతో ఒక క్రొత్త సంధి చేసికొనుటో, లేక అంత ఉత్తమమైన గ్రంథమునందించినందుకు ఇంగ్లండ్ దేశమునకు తన గౌరవామోదయుతములైన అభినందనలు తెలుపుటకై ఒక అసాధారణ మంత్రిని ఇంగ్లండ్ పంపుటో చేయునని భావించును. ప్రత్యక్షపరిస్థితుల కనుగుణముగనుండి స్మరణీయములు, వీరోచితములుఅగు అనేక వాస్తవికాంశములను తెలుపు గ్రంథమది; అతఃపూర్వము అచుంబితములగు నూతన వస్తువులతో, నూతననాయకులతో (మనము-గ్రీక్, రోమన్, బ్రిటిష్‌జీవితచరిత్రలనన్నిటిని ఆపోశనముపట్టినామని కాదు) భావనలోను వివేకములోను సువిశాలమైన పరిధిలో వర్తించు ఆగ్రంథము ఉదాత్తతను, వ్యావహారిక భాషా సారళ్యమునుకూడ స్వాయత్తము చేసుకొన్నది. దానిలోని ప్రతిపుట మూడుకోలతెలుకలిగి, అందుండి రచయిత కన్నులు మన కన్నులలోనికిచూచుచున్నట్లుండును. హుంకరించుచు, చిరునవ్వునవ్వుచు, గొంతుతగ్గించి మాటలడుచు, మేఘగంభీర గర్జనలుచేయుచు, భుజములెగుర వేయుచు, తేరిపారచూచుచు రచయితమన మనోనేత్రము ముందుగా నడచిపోవు ప్రతిరూపమును, ప్రతికొండను, ప్రతినదిని, ప్రతిఅడవిని,ప్రతిగుట్టను,ప్రతి గులకరాతిని మూడుపరిణామములుగల వస్తువులుగా తీర్చిదిద్దు

చున్నట్లుండును. ఆ గ్రంథమందు ప్రదర్శితమైన స్మృతిసంధానకళా (mnemonics) చాతురివలన అందువచ్చు ప్రధాన, అప్రధాన వ్యక్తులందరు-వారి నిజస్వరూపాలతోను, స్వభావాలతోను, చేతలతోనుసహా - మన మనఃఫలకాలమీద చెరిపివేయ రాకుండ శాశ్వతముగా హత్తుకొనిపోవుదురు. అంతేకాక, ఆధునికయుగమందలి మానవులలో, జాతులలో నడవడులలో నైతికమూల్యములను నిర్ణయించి తీర్పుచెప్పగల ధర్మదేవత వంటిది ఆ గ్రంథము. అట్టి గ్రంథము ఈ దేశములో ఎట్టి సంచలనము కలిగింపలేకపోయినది. ఏ వార్తాపత్రికలోగాని ఆ గ్రంథమునుగూర్చి వ్రాయగా నేను చూడలేదు; దేశములో చాలామందికి అట్టిపుస్తకము ఒకటి ఉన్నట్లే తెలియదు. * 'బ్యూకానాన్' చాల్సియా ♦ లోని 'గ్రేట్ చైనీ రో' కు ప్రత్యేకదూతను పంపిన సంగతి నేనెరుగను; కాని, ఈ గ్రంథములోని పాత్రల నిగూఢమేధలను, హృదయములకు ఆ విషయము సువిస్పష్టముగ తెలియును. ఇటీవల గాలిసి,

---

* జేమ్సుబ్యూకానాన్ (1791-1868) అమెరికా సంయుక్త రాష్ట్రముల 15 వ అధ్యక్షుడు; 1857-61 మధ్య అధ్యక్షపదవిలో ఉండెను.

❖ లండన్ పరిసరములందలి గ్రామము. కళావేత్తలవాస భూమి; కార్లైల్ జన్మస్థానము,

♦ Great chieyne Row - చాల్సియాలోని ఒకవీధి; ఈ వీధిలోనే కార్లైల్ నివసించిన యిల్లుకలదు; ప్రస్తుతమందు కార్లైల్ మ్యూజియమ్ ఉన్నది,

నిప్పును, ప్రేమ మాహాత్మ్యమునుగూర్చి ఎక్కువగా ప్రస్తావింపబడకున్నను, ప్రజలందరకు వాటి ప్రభావము తెలియును. అందుచే వాటివంటిదేఅయిన ఈ గ్రంథము ప్రభావముకూడా వారిపై ఉండియేతీరును.

సాధారణశైలి, ఇమిడిక అను రెండు గుణముల తరువాత రచనాశిల్పములో ప్రధాన గుణము సాంకేతికత (Metonomy); అనగా-ఒక పదముచే, ఒక మూర్తిచే మరొక పదమును, మరొక మూర్తిని, స్ఫురింపజేయుట. ఇది కొంచెము తక్కువస్థాయికి చెందిన ఆదర్శవాదము (Idealism). ప్రపంచము సంకేతాత్మకమనీ, ఇందలి సంకేతములు, రూపములు సర్వమూ అస్థిరములనీ, పరిణామ స్వభావముగలవనీ ఆదర్శవాదము ప్రదిపాదించును. కవి యొక్క శక్తి ఈ సంకేతములను వశవర్తులను చేసికొనుటలో ఉన్నది; ప్రకృతిలోని వాస్తవికాంశమును-అది ఎంతగొప్పది, స్థిరమైనది అయినను-దాని నొక సరళ సంకేతముగా మార్చివేయుటలోను, అతని మానసిక స్థితి యొక్క ముద్ర వస్తువులపై పడునట్లు చేయుటలో అతనికిగల లాఘవములోను అతని శక్తి ఇమిడి ఉన్నది. ప్రపంచము, చరిత్ర, ప్రకృతి శక్తులు-సర్వమూ తాను సంకల్పించిన భావములే పలుకునట్లు అతడు చేయవలెను.

సర్వసాహిత్యము, సర్వప్రసంగము రచనాశిల్పగతమైన, లేక ఈ 'సాంకేతికతా' శక్తికృతమైన చమత్కారముగానే నాకు కనిపించును. "ధూళికణాలను మహాపర్వ

తాలుగాను. మహాపర్వతాలను ధూళి కణాలుగాను మార్చి వేయుశక్తి వక్తచేయుపని'' అని ఐసాక్రటీస్ (క్రీ. పూ. 436–338. ఏథెన్స్‌నగరవక్త; రచనాశిల్ప ప్రవక్త) ఒకప్పుడు చెప్పెను. సరిగా అదే కవిత్వమూ, భావనాశక్తి కూడ చేయుపని. మనము చూచు ప్రతి నూతన వస్తువును అంతకు ముందు మనకు సుపరిచితమైన ఒక అనుభవమునకు మరొక నూతన ప్రతిగానే మనము గ్రహింతుము. వెంటనే దానిని మనకు అనుగుణమగు భాషలోనికి అనువదించివేసికొనుటకు పూనుకొందుము. ఈ విధముగానే మన సర్వపదజాలమూ ఏర్పడినది.

ప్రతివస్తువునకు రెండు విధము లుండును. కంచర గాడిదెల పందెములో గెలుపొందిన విజేత ఆ అర్ధగార్ధభ ములమీద పద్యము చెప్పినచో ఒక చిన్న బహుమతి ఇచ్చెదనని ప్రకటించినప్పుడు 'పిండార్' (గ్రీక్ భావకవి–క్రీ. పూ. 522–448) ఆ మాట తనను మిక్కిలి బాధించి నట్లు నటించెను. కాని, తీరా తగినంత పెద్దబహుమతి నిత్తు నని ఆశ పెట్టగానే అత డీ పద్యము చెప్పెను:

''జయము జయము ప్రభంజన పదాశ్వ జాతితనయలార !
జయము జయము వాయువేగవియన్మార్గ గమనలార!''

("Hail, daughters of the tempest-footed horse,
That skims like wind along the course.")

అది అతనిలోని రెండవ విధము. నే నొకప్పుడు 'నూతన నగరము' (New city) అను ప్రదేశము మీదుగా

వెళ్లుట తటస్థించినది. వందలకొలది ఇతర స్థలముల విషయములో వలెనే అప్పుడు ఆ ప్రదేశమును గూర్చి కూడ అనతి కాలములో అది ఒక మహానగరము కాబోవుచున్నదని భావించుచుండిరి. ఆ నగర స్థాపకులలో ఒక వ్యక్తి నాకు తటస్థపడెను. ఆ పరిసరములలో గల నదిని, పడవల రేవును, నగరవిస్తృత్యవకాశాలను అతడు నాకు చూపించి, నాతో- "అయ్యా! అరవై ఇళ్ళుండి. ఒక్క రాత్రి అంటే ఒక్క రాత్రిలో డేరాలు వేసినట్లు లేపివేసినాము" అన్నాడు. షికాగో రైల్వేజంక్షన్‌గా అభివృద్ధిపొందిన తరువాత ఆ నగర స్థాపక మిత్రుని తిరిగి నేను కలుసుకొనుట సంభవించినది. అప్పుడతడు షికాగోకు నివాసము మార్చినాడు. ఒకప్పుడు నాతో చెప్పుకొని ఉండిన అతని బంగారు కలల నన్నిటిని ప్రస్తుతము షికాగో నగరానికి అతడు బదలీచేసినాడు, ఆ వెనుకటి కార్యక్షేత్రము ఇప్పు డాతనికి జ్ఞాపకమే లేదు. 'ఇప్పు డా పట్టణమేది? అక్కడ ఒక నదీ, పడవల రేవు కూడ ఉన్నదిగదా!" అని నే నంటిని. "ఔను! అప్పుడు మేమందరమూ ఆ ఇసుకపర్రలలో మహైశ్వర్యము సాధించవలెనని తగని ఉబలాట పడితిమి." "మరి ఇప్పుడా పట్టణమేమైనది?" "ఇప్పటికీ ఆ అరవై ఇళ్ళూ ఉన్నవి. కాని, ఇటీవల నేనా ప్రాంతాలకు వెళ్ళినప్పుడు ఒక గుడ్లగూబ తప్ప మరొక ప్రాణి జాడ అక్కడ కనబడలేదు." అటుతరువాత చాలా కాలానికి శామ్యుయల్ డెక్స్టర్ దక్షిణబోస్టన్ బ్రిడ్జి అభివృద్ధిప్రణాళికను సమర్థించుచు వాదించునప్పుడు ఆ

అధికవృద్ధిప్రణాళికలు కారణముగా సముద్రతీర వ్యాపారము మూసివేయవలసి వచ్చినదను తీవ్రవిమర్శల నెదుర్కొన వలసివచ్చెను. దాని కతడు స్మితముగా ఇట్లు బదులు చెప్పెను: "ఇప్పుడు 'రాక్స్‌బరీ' పిల్ల కాలువమీద వాణిజ్యమును, నౌకాయానమును నిరోధించితిమను మహాభియోగమునకు నేను సమాధానము చెప్పకొందును." అని. శోభాస్థానమగు వసంతమును "నికృష్టమైన తృణరాశి" గా అభివర్ణించుట, అత్యావశ్యకపదార్థాలను ఉత్పత్తి చేయు పొలమును బఠానీదుబ్బులూ, టర్నిప్, హెన్‌రూట్ దుంపలూ పెరుగు సాధారణ భూమిగా ఈసడించుట కడు సులభము. ప్రతివిషయమునకు రెండు విధములుండును. షేక్స్‌పియర్ ఇట్లనెను: "అభిప్రాయమనునది నీతినియమాలు లేనిది; దానిని తోలుజాకెట్టును వలె తిరుగవేసి, బోర్లవేసి కూడ తొడుగుకొన వచ్చును."

నాకు 'ఈ' అను ఒక స్నేహితుడున్నాడు; అతడు అభిప్రాయ వైవిధ్యవాదులకు (Opinionists) ఒజ్జబంతివంటి వాడు. ఆకృతిదాల్చి, భూమిపై సంచరించుచున్న ఏప్రిల్ దినమువంటివాడు. ఏప్రియల్ నెలలో స్వర్ణతుమమైన ఎండతో పాటు వడగళ్ళ వానలును,దుర్భరమైన తూర్పుగాలులతో పాటు మధురములైన నైరృతి పవనములును పర్యాయక్రమమున వచ్చుచు పోవుచు దేనికది అత్యంత శక్తిమంతమై తన ప్రభావమును సర్వపదార్థములపైని వెలయించుచుండును. ఏవిషయమునుగూర్చియైనను అతని అభిప్రాయములు అతనివే!

ప్రకృతిలో ఆకులు, గాలి, గడ్డి మరీఎక్కువగాఉన్నవని అతడు చిరాకు పడును: పక్షులకు ఈకలు, గుర్రాలకు కాళ్లు మరీ ఎక్కువగా ఉన్నవనికూడవిసుగుకొనునేమో! అతనిఊహలో ఈజిప్టుఅంతా వట్టిమోసము; పాలస్తీనా పాపని అయిపోయినది; ఇంగ్లండుదంతా తారాజువ్వ వ్యవహారము, గప్పున వెలిగిచప్పున ఆరిపోవును; మళ్ళీ అతడు ప్రకృతి దృశ్యచిత్రణ మొక్కటే నిజ మైన చిత్రకళ అనును. ఒకప్పుడు మేముఒకఅడవిలో నడచుచు ఒక 'గోల్డెన్ రాడ్' మొక్కల గుబురువద్దకురాగానే అతనిట్లనెను: "ఓహోహో! ఆ మొక్కలుచూడుము! అవి కాలమును అమితముగా మార్చివేయగలవు. మనకాలమును పెట్టుబడి పెట్టు విధానము లన్నింటిలోను ఇదే అత్యంత లాభదాయక మైనదని నాకు అనిపించుచుండును." అనుదినము అన్ని కంపెనీలలోను సరిగా ఇదే భాగవతము జరుగుచుండును. ప్రతి న్యాయస్థానములోను, ప్రతిశాసన సభలోను, సాహిత్యకళ లోను, ప్రతిమనస్సుచరిత్రలోను ఇదేబంతి ఎగురుచుండును. భావనా బలాధిక్యముచేత మనము మనప్రస్తుత మనస్స్థితికీ, విశ్వాసములకూ ఇతరవ్యక్తులు, ఇతరపదార్థములు విధేయత ప్రదర్శించునట్లు చేసికొనుటకే సదాయత్నించుచుందుము.

నేను మరొక్క విషయమును గూర్చి ప్రసంగింపవలె నని అనుకొన్నాను. అది-ఇటీవల విమర్శనరంగములో ప్రము ఖముగ వినవచ్చుచున్న సమస్య. సాంప్రదాయిక (Classic), యదృచ్ఛా (Romantic) విధానాలలో ఏది స్వీకార్యము? లేక సాంప్రదాయికత అన నేమి? అను సమస్య.

ఆత్మనుండి ప్రత్యక్షముగ ఆవిర్భవించునది గావున రచనాకళ మానవుడు పొందగల వరము లన్నిటిలోను అత్యుదాత్తమైనది. అది మానవునకు ఉదాత్తతతోను, నిత్యత్వముతోను అనుబంధమును కలిగించుచున్నది. అతిపురాతనమూలతత్త్వములోని వైవిధ్యమును, మహాశోభను అది వ్యక్తము చేయుచున్నది. మరియు సాహిత్యకళలో ఉదాత్తమాధుర్యముతో మనల నాకర్షించులక్షణ మున్నది. మానవునకు గల అన్యాలంబనావశ్యకతయే ప్రతిరచయిత యొక్క దుర్బల, చంచల శీర్ణ ఆత్మయు మానవజాతి పాడు బృందగీతిలో కంఠము కలుపునట్లు ప్రేరేచుచున్నది. గత రచయితల మేధల నుండి ప్రవహించి వచ్చిన భావములతో అతని ఆత్మ పరిపుష్టమగుచున్నది; తన ఆశలను వర్తమాన మేధలతో సమముగ పంచుకొనుచున్నది. అందుచేతనే ప్రపంచ మంతయు ఒకరోజు ఉండిపోవు నిస్సహాయులగు యువజనముతో నిండిఉన్నను, సాహిత్యము సువిశాలములగు ఆస్తిక్యభావముల యొక్కయు, నైతిక సత్యములయొక్కయు మధురగానముతో ప్రతిధ్వనించుచున్నది.

సాంప్రదాయికత అన నేమి? సాంప్రదాయిక కళ ఆవశ్యకతా సంబంధియగు కళ; ఆధునిక, లేక నవ్యకళపై క్షణికహఠాత్సంభవముల ముద్ర ఉండును. ఒకటి కేవలము ఇచ్ఛాజన్యము; చిత్తచాంచల్యమునుండి, తొందరపాటు తనమునుండి ఉద్భవించునది; మరొకదానిలో ఒక ఆవశ్యకత, ఒక నియమము గోచరము లగును.

ఒకే వ్యక్తియొక్క జీవితములోను, స్వభావములోను సంఘటిల్లు హఠాత్సంభవాలపై సర్వమూ ఆధారపడియుండు రాజత్వవ్యవస్థకు సంబంధించిన రాజకీయములను 'యదృచ్ఛా (Romantic) రాజకీయములని వ్యవహరింపవచ్చును. అధికారము ప్రజలనుండి ఆవిర్భవించి, ప్రభుత్వము ప్రజలకే బాధ్యత వహించుచుండు ప్రజాస్వామిక వ్యవస్థలోని రాజకీయాలను 'సాంప్రదాయిక' (Classic) రాజకీయాలని అనవచ్చును. సాంప్రదాయికత ఉన్నదాని అభివ్యక్తము చేయును. యదృచ్ఛావిధానము లేనిదానిని కల్పించును. సాంప్రదాయికత అవశ్యోత్పాద్యము; యదృచ్ఛానారస్యతము ఇచ్ఛాధీనము. సాంప్రదాయిక సాహిత్యము మొదలవెలసి, పిమ్మట తదనుగుణములైన సిద్ధాంతాలను రూపొందించును. అంతే కాని, ఏ అప్రధానలక్ష్యాలనుండో తాను ఉద్భవింపదు. ఆ విధానములో-రాజ్యార్థికవ్యవస్థకు సంబంధించిన ఒకసిద్ధాంతమును స్థాపించుటకై ఒక నవల వ్రాయుట ఎన్నడూ జరుగదు.

అన్యులను తృప్తిపరచుటకై మనము పూనుకొనుట తగదు. అట్లు పూనుకొన్నచో తుదకు వారికి అసంతృప్తినే కలిగింతుము. నౌకాయానోపయోగము కొరకు ఒక వేధశాలను నిర్మించుటను ఆగ్ బర్గ్ నగరము (జర్మనీ)లోని 'ఆల్ జిమీన్ జీటుంగ్' (Allgemiene zeitung) సంస్థ వ్యతిరేకించెను. మనమైనను మన చిత్రకళాశాల (School of Design)

వలన విద్యార్థులకు మంచి ఉద్యోగాలను సంపాదించి పెట్ట గలవని వ్రాచిపడలేము.

నేను 'ప్లుటార్క్' (గ్రీక్ నీతిశాస్త్రవేత్త; జీవిత చరిత్ర రచయిత. క్రీ. శ. 46–122) రచన నొకదానిని చదివినప్పుడు, లేక ఒక గ్రీక్ పాత్రను చూచినప్పుడు ఇతర జాతుల వారందరికంటె గ్రీకులు విస్పష్టతరమైన భావనాశక్తి గలవారని విద్వాంసులలో వ్యాప్తిలో ఉన్న అభిప్రాయము సరియైనదని నాకు అనిపించును. కాని, ప్రాచీనతను గూర్చిన నా భావనలో కాలమున కెక్కడను అవకాశము లేదు. ప్రాచీనతను మనము ప్రేమించునప్పుడు, ప్రశంసించునప్పుడు మాత్రమే నిజముగా మన మాటలలో గాని, చేతలలో గాని విస్పష్టత, సాహజికత ఉట్టిపడును. సమాజములో నా కది కనిపించదు; ఆధునిక గ్రంథాలలో అది అతివిరళముగ కనిపించును. కాని, నేను పచ్చికబీళ్ళలోనికి వచ్చినప్పుడు అక్కడ తిరిగి నేను ప్రాచీనతను దర్శింతును. ఒకసారి– 'అంబా' అని అరచే పశువులతోను, చెట్లతోను, సెలయేళ్ళతోను, సుదూర ప్రకృతిదృశ్యాల ఆహ్లాదకరములైన వంపులతోను కూడిన మైదానాలలోనికి నేను వెళ్ళితినా, ఇక అవి 'తెసాలీ' (గ్రీస్‌లోనిది), 'ఎన్నా' మొదలైన ప్రాచీన మైదానాలో, 'కంకార్డు' (మెసాచూసెట్స్ రాష్ట్రములోది) 'ఎక్టన్' (మిడిల్ సెక్స్‌లోది) మొదలైన అధునాతన మైదానాలో నేను పోల్చుకోలేను.

ప్రతిభావంతుడైన ఒక వ్యక్తిగాని, ప్రేమకు, సౌంద ర్యమునకు తావలములైన రచనలు గాని ఆదేశములవలన రావు; ఎంతటి ఉత్తమ సూత్రములైనను వాటిని బంధించి ఉంచలేవు; ఆరోగ్యమువలె-ఎప్పటికప్పుడవి మనము కారణ ములు గుణించలేని నూతన ఫలితాలుగానే సంభవించు చుండును. మీా సూత్రములతో మాా చెవులలో రణగుణధ్వని చేయవద్దు. కవి వాడిన మాటలవరకు మాత్రమే పోయి ఆగిపోకుండా, అతని ఊహాప్రసరణ ధోరణిని, అతని మన స్సుకు సంబంధించిన విశిష్టలక్షణమును గుర్తింపగలిగిననాడు విమర్శకూడ ఒక కళయే! శక్తిసామర్థ్యాలుకాదు ముఖ్యము; ఒక శ్రుతి ఉండుట ముఖ్యము. కొన్ని విశిష్టగుణా లుండుట కాదు కావలసినది; మనలను ఎట్టి మనస్థ్సితిలోనికి ఆయా రచ నలు కొనిపోగలుగుచున్నవి అను విషయము ప్రధానము.

'వ్యాసావళి' పంద్రెండవ సంపుటమునుండి-



# సత్యము

లాటిన్ జాతులవారిలోకంటె ట్యూటానిక్ తెగల వారిలో హృదయవిశుద్ధి విలక్షణముగా గోచరించును. 'జర్మన్'అను పదోచ్చారణ మాత్రముననే రూఢముగా నిజాయతీ, మర్యాద మున్నగు భావములు స్ఫురించును. వారి లలితకళలు ఈ విషయమును దృఢపరచును. ప్రాచీన శిల్పాలలోగాని, సచిత్రముగ తయారుచేసిన ప్రార్థనాప్రసంగసంపుటాల (Missal) లో గాని మతాచార్యులయు, ఇతర జనులయు, ముఖాలు ప్రగాఢమైన విశ్వాసముతో ప్రకాశించుచుండును. ఈ గుణముతోపాటు వంశపారంపర్యముగవచ్చు ఋజుత్వము, సమయపాలనము, వాణిజ్యమువలనఅబ్బిన నిక్కచ్చిగ వ్యవహరించు గుణముకూడ కలిపినచో ఇంగ్లీషువాని సత్యవర్తన అగును. ఆంగ్లప్రభుత్వము నిక్కచ్చిగా తన విధులను నిర్వర్తించును. ఆ రాజ్యపౌరులు ప్రభుత్వవిషయములో స్వల్పాపరాధమునుగూడ అర్థముచేసికొనలేరు. రాజులకు ప్రత్యేకాధికారములుగల ప్రాచీనకాలములో ఏమాత్రము వాగ్దానభంగము జరిగినను ప్రజలు దానిని దుర్భరమైన అన్యాయముగా పరిగణించి ఆగ్రహించుచు వచ్చిరి. ఆధునిక కాలములో ప్రభుత్వములో ఉంచబడిన రాజకీయ విశ్వాసములో ఏమాత్రము నియమవైరుధ్యము, వక్రత వ్యక్తమైనను, జాతి జాతిఅంతయు ఒక్కమారుగ విచారణసంఘముగాను, సంస్కరణ సంఘముగాను మారిపోవును. విడివ్యక్తులు

కూడ ఎంత స్వల్పవిషయములో అయినను వాగ్దానాలను పాటించియే తీరుదురు. ఒకసారి ఒకమాట వ్రాసినచో * 'డూమ్స్ డేబుక్' లోని వ్రాతవలె అది చెరుపరానిదై కలకాలము చెల్లుబాటుఅయి తీరవలసినదే!

ఆచరణ రంగములో వారికిగల సామర్థ్యమునకు మూలాధారము జాతిగతముగా వారియందు కనుపించు శ్రద్ధాభావము. సత్యసంధత అనునది సహజప్రవృత్తినుండి ఉద్భవించు గుణము. వ్యవస్థీకరణములో ఎప్పుడును దానిదే పైచేయి. ప్రకృతి కొన్ని జంతువులకు తగినంత శక్తి కల్పింపనందుకు పరిహారముగా జిత్తులమారితనమును వాటికి ప్రసాదించును; కాని ఆ జిత్తులమారితనమును చూచి ఇతర జంతువులన్నియు – అవిసంఘాపచారమును సహింపజాలనివైనట్లు – కడు ఏహ్యభావమును ప్రదర్శించును. తగినంత శక్తిని కల్పించుటకు వీలైన ఉదాత్తతర ప్రాణులలో ప్రకృతి సత్యానురక్తిని నిక్షేపించును. మానవునితో రాజీపడని అడవిజంతువులు పరస్పరము విశ్వాసఘాతకములుగా ప్రవర్తింపవు. తోడేలు తాను వేటాడిన జంతువునొకచోట దాచి, తనతోటి తోడేళ్ళను ఆప్రదేశమునకు తోడుకొనివచ్చిన తరువాత- అక్కడ నేలను గోళ్ళతో గీరినప్పుడు ఆవేట కనిపించక పోయినట్లైతే, తత్క్షణము ఆ తోడేలును పట్టి మిగిలిన

---

* నార్మన్ విజేత విలియమ్ (1085-86) ఆదేశానుసారము ఇంగ్లండులోని భూములనన్నిటి కొలిచి తయారుచేసిన భూమి లెక్కల గ్రంథము.

తోడేళ్లు ఖండ ఖండములుగా చీల్చిచంపివేయునందురు. ఇంత కంటె బలమైన జాతిప్రవృత్తికి ఫలితముగా ఆంగ్లేయుల సత్యసంధత ఏర్పడినట్లును, అందుచే దానికి వారు తట్టుకొన గలిగినట్లును కనిపించును. మనసులో అనుకొన్నది పైకి చెప్పుటలోగాని, వాగ్దానములను పొదుపుగ వాడుటలోగాని వారు నిర్మొగమాటముగ వ్యవహరింతురు; ఇతరులుకూడ వారితో అట్లే సూటిగా వ్యవహరింపవలెనని వారు కోరుదురు. ముఖమునకు తొడుగు ధరించిన ఒక పయోముఖ విషకుంభముతో వ్యవహరించు ఆవశ్యకత మనకు ఉండదు. ఇప్పుడు వారి సత్యసంధత ఎట్టిదో తెలిసికొందము. ఒక సరళరేఖగీసి దానికి ఎక్కడ ఎవరు అడ్డువచ్చిన వారిని గురించే విచారింతము. జాతి అంతటిప్రేమను చూరగొనుటవలన ఆ జాతికి ప్రతినిధిగా రూపొందిన ఆల్‌ఫ్రెడ్ (849–901) ను గూర్చి నార్మన్ విజయము (1066) నాటి ఒకరచయిత అతడు 'సత్యవాది' అని వ్రాసెను. ఆర్థర్ (క్రీ. శ. 5, 6 శతాబ్దాలనాటి బ్రిటిష్ రాజు) పినతండ్రియగు అరీలియస్ రాజునుగూర్చి 'జెఫ్రీఆల్ మన్‌మౌత్' (1100–1154 ఆంగ్లచరిత్రరచయిత) "అతడు అన్నిటికంటె అసత్యమును అధికముగా ద్వేషించెను" అని వ్రాసెను. యూరప్ ఉత్తరప్రాంతవాసి గట్టోరమ్ నార్వేరాజగు ఓలాఫ్ (995–1030) తో "రాజశపథములను పాలించుట రాజరికపు లక్షణము" అనెనట! ఆంగ్లవంశములలో ఆశయవాక్యములుగా మండలింపులతోకూడిన సామెతలు ఉండును. ఉదాహరణకు 'ఫేర్‌ఫాక్స్' వంశమువారి

ఆశయవాక్యము "ఫేస్ ఫాక్" (చెప్పుము–చేయుము; అనగా చెప్పినమాట కనుగుణముగ వర్తింపుము) ';ఫియెన్నీ' వంశము వారి ఆశయవాక్యము "సే అండ్ సీల్" (చెప్పుము – ముద్ర వేయుము; అనగా ఆడినమాట తప్పకుము.) 'డెవ్రీస్' వంశము వారిఆశయవాక్యము "వీరోనిల్ వీరియస్"(సత్యమునుమరుగు పరచలేవు) స్వవచః పాలకులుగా నున్నందుకు ఆంగ్లేయులు గర్వింతురు. వారు రహస్యపరిభాషలో మాట్లాడిన విషయములను సూటిగ చెప్పునప్పుడు "దానిని ఇంగ్లీషులో చెప్పినచో......" అని ఆరంభింతురు. ఎవరైన తమతో అసత్యము చెప్పినచో అది తమకు ఘోరావమానముగ వారు భావింతురు. సంఘములో చాల హీనస్థాయికి చెందినవారు కూడ 'ఆనర్ బ్రైట్'(మంచీ –మర్యాద)అనుపదమువాడుదురు; వారి మొరటు ప్రశంస: "వాని మాట ప్రామిసరీనోటు" అని. మాట తభావతును, అన్యోన్యవిరుద్ధ ప్రసంగాలను వారు అసహ్యించుకొందురు; అట్టి వ్యక్తులకు ప్రజాభిప్రాయము ప్రతికూలమగును; అట్టివారి పలుకులలోని అసంబద్ధతనుగూడ ప్రజాభిప్రాయమే నిర్ణయించుచుండును. ఫ్రెంచివాతావరణములో పెరిగిన చెస్టర్ ఫీల్డ్ ప్రభువు (ఆంగ్లరాజ్యపాలనాదక్షుడు రచయిత–1694–1773) కూడ 'పెద్దమనిషి.ని నిర్వచించుచు, సత్యమే అతనిని విలక్షణునిగా చేయును" అనెను. అతడన్న మాటలలో ఇంతగా తనజాతి ఆమోదమును ఆచుకొన్నమాట మరొకటిలేదు. వెల్లింగ్టన్ ప్రభువు(బ్రిటిష్ జనరల్; 1769–1852) ఫ్రెంచి జనరల్ కెల్లర్మన్ కు 'ఆంగ్లోద్యోగి హామీమీద

పూర్తిగా ఆధారపడిఉండవచ్చు, నని సలహా చెప్పెను; అట్లు చెప్పుటకు అతనికి సంపూర్ణమైన అధికారమున్నది. అన్ని జాతులలోను ఆంగ్లేయులే సత్యసంధత అను లక్షణమునకు ఎక్కువవిలువనిత్తురు; ఫ్రెంచివారినుండి వారిని పృథక్కరించి చూపులక్షణముకూడ ఇదే అని వారు భావింతురు; ప్రజల విశ్వాసమునసనుసరించి ఫ్రెంచివారివర్తనలో సత్యముకన్న మర్యాద ఎక్కువగా గోచరించును. ఆంగ్లేయుడు కొండంతలను గోరంతలుగ జేయునేకాని, గోరంతలను కొండంతలుగ చేసి చెప్పడు; ఏ విషయమునుగూర్చి అయినను అదే సర్వాధిక మని 'తమ' ప్రత్యయముచేర్చి చెప్పుటను అతడు పరిహరించును. మెచ్చికోలులో అతడు ఆత్మనిగ్రహము ప్రదర్శించును; ఫ్రెంచిభాషలో అబద్ధమాడకుండ ఎవడును మాట్లాడుటే సాధ్యముకాదని అతని ఆరోపణ.

ఐశ్వర్యములోను, అధికారములోను, ఆతిథ్యములోను సాహజికత వారికి ఇష్టము. ఆడంబరముతో కూడిన ప్రదర్శనము వారికి తేలికగా అలవడు గుణముకాదు; లోకమును వారు యథాతథముగా గ్రహింతురు. వారికి ఆభరణములపై ఎక్కువ మోజులేదు; ఆభరణాలను ధరించుటే వచ్చినచో వజ్రఖచితములైన వాటిని తప్ప ధరింపరు. థామస్ ఫులర్ * రచనలో "ఎలిజబెత్ రాణి కాలములోని ఆంగ్లస్త్రీ ఇమిటేషన్ వజ్రాలతో చేసిన ఆభరణాలను ధరించునంత ఒర్పుతో అసత్యవచనమును జీర్ణించుకొనేది"

* ఆంగ్లమతబోధకుడు రచయిత-1608-1661.

అను వాక్యమును వారు అమిత హర్షముతో చదువుదురు. ట్యూటానిక్ జాతులవారి కందరికీ గల విలక్షణధర్మముగా చెప్పబడే 'భూప్రణయము.' అనగా–భూసంబంధమైన ఆస్తికి అధిక ప్రాధాన్య మిచ్చుగుణము వారిలో ఎక్కువగా కనిపించును. వారు కట్టడములను రాతితో నిర్మింతురు; ప్రభుత్వభవనములూ, విడివ్యక్తుల భవనములూ కూడ బ్రహ్మాండముగ, ఎక్కువమన్నిక గలిగి ఉండునట్లు నిర్మితము లగును. వారి నౌకాశ్రయములను, ప్రభుత్వభవనములను మన అమెరికన్ కట్టడములతో పోల్చునప్పుడు–మనము ఒక డాలరు (సుమారు 4 రు॥లు) ఖర్చుపెట్టుచోట వారు ఒక పౌను (సుమారు 15 రు॥లు) ఖర్చుపెట్టెదరని సాధారణముగ చెప్పుకొనుట కలదు. నిరాడంబరమైన విలువైన దుస్తులు, నిరాడంబరమైన విలువైన వస్తుసామగ్రి, నిరాడంబరమైన విలువైన అలంకరణము ......ఆంగ్లేయుల గృహములలోను, ఆస్తులలోను సర్వత్ర సత్యానురక్తియేవిలక్షణముగ పరిస్ఫుటమగును.

వారు పరస్పరము మనస్సులోని మాట చెప్పుకొందురు; ఆంగ్లేయుడు ఆంగ్లేయుని విశ్వసించును. ఫ్రెంచి వారు నిజాయితీ యొక్క ఆవశ్యకమును గుర్తింతురు. కాని, ఆంగ్లేయుడు ఫ్రెంచివారి మెప్పుకొరకు 'నిజాయితీ' అను జోనును అమర్చుటలేదు; హృదయపూర్వకముగానే అతడు ఋజుత్వముతో తన వ్యవహారములను దిద్దుకొనును. ఫ్రెంచి జాతీయుడు దాంభికుడు. 'మాడమ్‌డస్టాల్' (ఫ్రెంచిరచ

యిత్రి: 1763-1817) "ఆంగ్లేయులు విజయమును, నిజాయితీని ఐక కాలికముగ సాధింపగల మార్గము కనుగొనుట వలననే ముఖ్యముగా వారు నెపోలియన్ (ఫ్రెంచిచక్రవర్తి, 1769-1821) కు చాలా చికాకు కలిగించినారు" అనెను. ఆమె వైదేశిక పాఠకులు ఆమె అన్నమాటకు ఎంతఎక్కువ విలువ నిత్తురో అప్పుడామె గ్రహింపలేదు. వెల్లింగ్టన్ (బ్రిటిష్ జనరల్-1769-1852) నెపోలియన్ బోనపార్టి నిర్మించిన సైనికశ్రేణులను నిర్మూలింపగలఉపాయమును తన నిజాయితీ సహాయముననే కనుగొనగలిగెను. సామ్రాజ్యభావన అసత్య ప్రాతిపదికపై వెలసినదని గుర్తించిన వెంటనే నెపోలియన్-సిద్ధాంతములను గూర్చి ఎక్కువగ వాదించుటమాని వేసి, కేవలము యుద్ధముననే నమ్ముకొని వ్యవహరింపసాగెను. యుద్ధ ఫలితముగా నూతనవాణిజ్య సౌకర్యములూ, వ్యవసాయము లోను, వస్తూత్పత్తిలోను అభివృద్ధి సిద్ధించకపోయినచో-కేవలము వినోదములు, బాణసంచా, పండుగచేసికొనుట మాత్రమే యుద్ధపర్యవసానములైనచో- ఐశ్వర్యమును, అభివృద్ధిని కాంక్షించు ఏ జాతియు యుద్ధమును సమర్థింప జాలదు; పదిమంది కొకడు వంతున బలాత్కారముగ సైన్యములో చేర్చబడుచుండిన ఫ్రాన్సువంటి దేశము విషయమై ఇక చెప్పనే అక్కరలేదు. అందుచేత-వెల్లింగ్టన్ లిస్బన్ వద్ద సైనికశిబిరాలలో కొన్ని ఏళ్ళపాటు నానా యాతనలూ అనుభవించి, ఆ స్థావరమునుండి చివరకు బ్రహ్మాండమైన తన సైనికశ్రేణులను వాటర్లూవరకు విస్తరింప జేసెను;

యూరప్ దేశాల వ్యర్థదర్పాలాపములలో కంటె తన దేశీయులలోను వారి హేతుబద్ధ వాదములలోను అధిక విశ్వాసము ఉండుటవలననే వెల్లింగ్టన్ అంతటి ఓర్పును ప్రదర్శింప గలిగెను.

నేను మన దేశము (అమెరికా) నకు తిరిగివచ్చిన తరువాత 'మాంట్రీల్' (కెనడాలోని ఒక నగరము) లో ఒక 'సెంట్‌జార్జ్' ఉత్సవమునకు అతిథిగా వెళ్లుట తటస్థించినది; అక్కడ అధ్యక్షుడు ప్రసంగించుచు "ఎక్కడ ఒక ఆంగ్లేయుని కలుసుకొన్నను అతడు సత్యవాదిగానే ఉండునను విశ్వాసము తనతోడి దేశీయులందరకు గల" దని వారిని అభినందించెను. ఆ పండుగనాడు, అనగా ఏప్రిల్ 23 వ తేదీని ప్రపంచములో ఇద్దరు ముగ్గురు ఆంగ్లేయులైన ఉన్న ప్రతిప్రాంతములోను వారు ఒకచో కలిసికొని ఋజుత్వముతో కూడిన తమ జాతీయతను నిలబెట్టుకొను విషయములో అన్యోన్యము ప్రోత్సహించుకొందు రన్నచో, ఆ పండుగ ప్రయోజనరహిత మైనదని ఎవ్వరు ననజాలరు.

సింహముఖములో నున్ననుసరే . నిష్ఠురసత్యమును చెప్పగల శక్తివిషయములో ఆంగ్లేయులను ఎవ్వరును అతిశయింపలేరు. బిషప్ లందరును బంగారముతో నిండిన పర్సులను రాజుగారికి కానుకగా ఇవ్వవలసియున్న రాజుగారి జన్మదినోత్సవమునాడు ఎనిమిదవ హెన్రీ (ఇంగ్లండు రాజు-1491-1547) కి లాటిమర్ (ఆంగ్లసంస్కర్త; ఆత్మ

త్యా -1485-1555) "కులటాభిరతులను, వ్యభిచారులను భగవంతుడు దండించును" అను పంక్తివద్ద మార్కు పెట్టి 'వల్గేట్' గ్రంథము (బైబిల్ లాటిన్ భాషాప్రతి) ను కానుకగా ఇచ్చెను. ఇంగ్లీషువారు అన్యోన్యము సాహస గుణమును గౌరవించువారగుటచే హెన్రీ దాని నందుకొని మొదలకుండ ప్రక్కనున్న ఉద్యోగుల కిచ్చెను. వారి నమ్మకముల విషయమై వారికి అచంచలమైన పట్టుదల; సమయానుగుణముగ వారు తమ అభిప్రాయాలను తేలికగా మార్చుకొనలేరు. వేగముగా పయనించుటకు వీలులేనంతటి తల బరువు గల ఓడల వంటి వారు వారు. అదృష్టముగాని, దురదృష్టముగాని, వారిని తమ అనూచాన ప్రవర్తనా పథము నుండి చ్యుతులను జేయలేవు. నేను లండన్‌లో ఉన్నప్పుడు 1848 ఫిబ్రవరిలో పారిస్ నుంచి తప్పించుకొని ఎమ్. గిజో* అక్కడకు వచ్చినాడు. వ్యక్తిగత మిత్రులనేకు లతనిని చూడబోయిరి; వెంటనే ఎతీనియమ్ క్లబ్ ♦ లో గౌరవ సభ్యునిగా అతని పేరును ప్రతిపాదించుట జరిగినది. కాని, చివరకు ఎమ్. గిజోకు ప్రతికూలముగానే ఎక్కువ వోట్లు వచ్చి ఆ ప్రతిపాదన వీగిపోయినది. ఆంగ్లేయులు నిశ్చయముగా అతని పేరు ప్రఖ్యాతుల నెరుగుదురు. కాని, వారు చపలచిత్తులు కారు. కొన్ని సంవత్సరాలుగా వార్తాపత్రికలలో ఎమ్. గిజోను గూర్చి చదువుచు అతనిని ద్వేషించు

* ఫ్రెంచిచరిత్ర రచయిత; రాజ్యపాలనాదక్షుడు-1787-1874.

♦ 1824 లో స్థాపితము; లండన్ క్లబ్ లన్నిటిలోను ప్రముఖమైనది.

టకు, అసహ్యించుకొనుటకు వారు అలవాటుపడియుండిరి. ఇప్పు డతని స్థితిమారి, గౌరవనీయ ప్రవాసిగాను, తమ దేశ మునకు అతిథిగాను వచ్చినంత మాత్రమున వారి దృక్పథ ములో ఎట్టిమార్పును రాదు. అదే అమెరికను లైనచో క్షణములో వారి దృక్పథము మారిపోయి ఉండును.

విశ్వాసములలోను, ఆచరణలోనుకూడ ఒకేవిధమైన సత్యసంధతను తమ ప్రజానాయకులలో ఇంగ్లీషువారు అభిల షింతురు. సచ్ఛీలాభావమే ఐరిష్ ప్రజాప్రతినిధుల గౌరవము తక్కువస్థాయిలో ఉండుటకు కారణము. "వారిని చూడుడు. మొత్తము 127 గురు సభ్యులున్నారు; గొఱ్ఱెలమందవలె వోటు చేయుదురు; ఎప్పుడును ఒక నూతనవిషయమును ప్రతిపాదించిన పాపాన పోరు; నలుగురుతప్ప అందరూ రాబడి పన్నుకు అనుకూలముగా వోటుచేసినారు"అని ఆంగ్లేయులు ఐరిష్ సభ్యులనుగూర్చి అందురు. నిజమునకు - రాబడిపన్ను విషయములో ఇంగ్లీషువారిపై విధింపబడిన పన్నుల భారము నుండి ఐరిష్‌వారి ఆస్తిని మినహాయించుటలో ప్రభుత్వము అనాలోచితమైన నిర్ణయమే చేసినది.

పార్లమెంటుసభ లోపలగాని, బయటగాని సాహసికు లను చూచినచో ఆంగ్లేయులకు గుండె బెదురు. ప్రస్తుత కాలములో ఆంగ్లేయుల నావేశించియున్న ప్రధానోద్వేగము- మోసముపట్ల వారికిగల భీతావహము. మోసమనిన వారెంత ఎక్కువ భయపడుదురో, నిజాయితీకి, ధైర్యమునకు

స్వీయ విశ్వాసముల నంటిపెట్టుకొని యుండుటకువారు అంతఎక్కువ విలువ నిత్తురు. తమ ఆశయములను అంటిపెట్టుకొని ఉండువా రనిన వారికి చాల ఇష్టము; చపలత్వమునకు ఫ్రెంచివారిని వారు నిరసింతురు. దాంభికత్వమునకు జర్మనులను వారు అనాదరింతురు. 1848 ఫిబ్రవరిలో ఆంగ్లేయులు ఫ్రెంచివారిని చూచి ఇట్లనిరి. ''చూడుడు! ధైర్యముగా శత్రువులను కాల్చివేయగల శక్తి లోపించుటవలన ఫ్రెంచిరాజూ, అతని పక్షమూ పతనము చెందినవి; కాల్చుటకు కావలసిన ఆత్మ స్థైర్యము వారికిలేదు; రాజరికముయొక్క అంతస్సు, హృదయము నేడు అంతఎక్కువగా కృశీభూతమైనది''

సాహసికులైనవారిని ఏకారణాలవలన ఆంగ్లేయులు వ్యతిరేకించుచుందురో, సరిగా అవేకారణాలవలన తమ దేశ రాజకీయనాయకులనుగూడ వారు అనుదినము వ్యతిరేకించు చుందురు. తన హక్కుకొరకు ధైర్యముగా నిలబడు గుణమును, తన ఆశయముల పట్టును సడలింపవలసివచ్చు సందర్భమున ధనమునుగాని, అభ్యుదయమునుగాని నిరాకరింపగల ఉదాత్తగుణమును వారు ప్రేమింతురు. ఒక బారిష్టరుకు 'క్వీన్స్‌కౌన్సెల్' (రాణీగారి లాయరు) పదవికి సంబంధించిన సిల్కుగౌనును ఇత్తుమన్నచో, అది అతని జూనియర్ లాయరుకు ఒకరోజు ముందుగా లభించియున్నను దానినతడు నిరాకరించును. కాలింగ్‌వుడ్ ప్రభువు (ఆంగ్లనౌకాధిపతి; 1750-1810) 1794 జూన్ మొదటితేదీ విజయమునకుకూడ

'మెడల్'ను బహూకరింపనిచో, 1797 ఫిబ్రవరి 14 వ తేదీ విజయమునకు మెడల్‌ను స్వీకరింప నిరాకరించెను; అప్పుడు చాలా కాలముక్రితమే ఇవ్వవలసియుండిన ఆ మెడల్ కూడా అతనికి బహుకరింపబడినది. కాసిల్ రే * వెల్లింగ్టన్ ప్రభువును 'సీంట్రా' (పోర్చుగల్ లోని పట్టణము) విషయమైన అప్రతిష్ఠా భాజనమగు వ్యవహారమునకు సరియైన జవాబు చెప్పువరకు రాజుగారి దర్బారుసభ (లెవీ) కు వెళ్ళవద్దని సలహా చెప్పినప్పుడు, అతడు 'అసలెప్పుడైనను రాచదర్బారునకు వెళ్లుటకు వీలైన ఒక్క హేతువు చెప్పుము; నేను నేటి దర్బారుకే వెళ్లెదను. అట్లు చెప్పలేనిచో నేను రాచదర్బారునకు వెళ్ళనే వెళ్ళను'' అని బదులుచెప్పెను. ఆక్స్‌ఫర్డ్ వద్ద మౌలికపరిణామ వాదానుయాయులగు జనము టోరీపక్షము నకు చెందిన ఎల్డన్ ప్రభువునుచూచి ఇట్లనిరి: ''అదిగో-వృద్ధుడైన ఎల్డన్ ప్రభువు; ఆయనకు జయజయధ్వానములు సలుపుము;ఆయన ఎన్నడూ స్వార్థముకొరకు పార్టీనివంచించిన వాడుకాడు'' సమయానుకూలముగా వ్యవహరించువారికి వారు పార్లమెంటరీపరిభాషలో 'ట్రిమ్మర్స్'(వంతపాటగాళ్లు) అను పరిహాసనామము కల్పించిరి. అట్టివారిని ఆంగ్లశీలమెన్నడును ప్రేమింపదు.

ఆంగ్లేయులు వారి రాజకీయాలలో అసాధారణమైన అపోహలకు వశులగుదురు, 1848 ఏప్రిల్ 10 వ తేదీనాటి

---

* Castle reagh- బ్రిటిష్ రాజ్యపాలనాదక్షుడు - 1769-1822.

ఉద్యమమును విదేశీయులు ప్రోత్సహించి రెచ్చగొట్టిరని వారి ఉదాత్తగ్రంథాలలోకి కూడ ఎక్కిన వారి నమ్మకము అట్టి ఒక అపోహయే! దానితో సరితూగగల అపోహ: అమెరికన్ రాజకీయాలలో బానిసల సమస్యను రెచ్చగొట్టు ఉద్యమము వెనుక ఇంగ్లీషువారు ఉన్నారని ఈ దేశములో వ్యాప్తిలో ఉన్న ప్రజాస్వామిక చపల భావన. ఇతర సర్వ విషయాలలోను వివేకులుగా ఉన్న కొందరు పెద్దమనుష్యులలో కూడ ఈ అపోహ ఉండుట నేను గమనించినాను. 'విశ్వాసఘాతుకులగు ఇంగ్లీషువారి' ని (Profidious Albion) గూర్చి ఫ్రెంచిప్రజలలో ఉన్న కట్టుకథలు కూడా పై అపోహతో సరిపోల్చదగినవే! కాని, అనుమానము వ్యక్తులను వలె జాతులను గూడ మూర్ఖములుగా చేయును.

మందకొడి స్వభావముగలవారగుటచే ఆంగ్లేయులు ఇతర దేశాలవారితో సమానముగ శీఘ్రగాములుగా గాని, నిత్యసన్నద్ధులుగా గాని ఉండరు; అందుకే 'ఇంగ్లీషువారి తెలివి వెనుకబడును'' అనుమాట ప్రచారములోనికి వచ్చినది; దీనినే ఫ్రెంచివారు 'esprit d'escalier' (గత జలసేతు బంధనము) అని ఇంగ్లీషువారిని పరిహసించుచుందురు. ఇంగ్లీష్‌వారు తమ దేశము నంటిపెట్టుకొని ఉండుటకు, విదేశాలకు పోయినను దేశీయాచారాలను విడనాడకుండుటకు, వారి స్వభావములో గల ఈ మందకొడితనమే కారణము. 'ఎట్నా' శిఖరము (సిసిలీ-10,758 అ॥ల ఎత్తు) నధిరోహించుటకు పోవు ఇంగ్లీషువాడు తన టీ కెటిల్‌ను గూడ

తనతోపాటు శిఖరముపైకి గొనిపోవును. "Relation of England" (క్రీ. శ. 1500) అను గ్రంథమును రచించిన ప్రాచీనఇటాలియన్ రచయిత ఇట్లనెను: "నాకీవిషయము చాల నమ్మకముగా తెలిసినది-యుద్ధము అమితతీవ్రముగా విజృంభించి జరుగుచున్న తరుణములో వారు తమకాక్షణములో ఏమికీడు మూడనున్నదో లేశమేని ఆలోచింపక ఆహారవిహారాది జీవితసౌకర్యముల విషయమై ఎక్కువ శ్రద్ధ చూపుచుందురు." వారి కన్ను లెప్పుడును ఒక సురంగ గర్భములోనికి చూచుచున్నట్లుండును; వారికి తెలిసిఉన్న ఒకే ఒక అల్పసత్యమును-ప్రపంచములో అది తప్ప వేరేదియు లేదన్నంత దృఢవిశ్వాసముతో-ప్రకటింతురు. గినీ (ఒక ఇంగ్లీషునాణెము; 21 షిల్లింగులు) లలో వారి నమ్మకము అచంచలమైనదగుటచే, అన్నిసందర్భాలలోను వారు ధనవాదమే చరమవాదముగా స్వీకరింతురు. రోచెష్టర్ (జాన్ విల్మట్ రోచష్టర్-1647-1680; వ్యంగ్యనాటక రచయిత) సమ్మోహనాస్త్రాల ప్రభావము ఇంగ్లండుమీద ఎక్కువగా ఉన్న సమయములో ఒక వ్యక్తి ఒక 100 పౌన్ల నోటును ఒక పెట్టెలో పెట్టి సీల్ చేసి డబ్లిన్ బ్యాంకులో గుప్తపరచెను; పిమ్మట నిద్రావస్థాసంచారులను, (Somnabn-? lists), మెస్మరిస్టులను, ఇతరులను ఉద్దేశించి పత్రికలలో ఎవరైనను తన నోట్ నెంబరు చెప్పుకొనగలిగినచో ఆ నోట్ వాని కిచ్చివేయుదునని ప్రకటించెను. ఆరుమాసము లతడా నోటు నట్లు బ్యాంకులో ఉంచెను; ఈలోగా అడపాదడపా

పత్రికలలో విప్రుల దృష్టి నాకర్షించు ప్రకటనల నతడు చేయుచునే ఉండెను. కాని, ఒక్కడును దాని నెంబరు చెప్పకొనలేకపోయెను. అప్పుడు ఆ వ్యక్తి "ఈవిధముగా రుజువైపోయిన ఈ అసత్యమునుగూర్చి ఇకముందు నేను పట్టించుకొనక్కరలేదు" అనెను. న్యాయాధిపతి సర్ జాన్ ను గూర్చి ఇట్లు చెప్పకొందురు. ఒకప్పుడు ఒక కేసులో ఒక పక్షపు న్యాయవాది చెప్పిన వాదము విని ఆయన మనస్సులో ఒక నిశ్చయమునకు వచ్చెనట! పిమ్మట ఎదిరిపక్షపు న్యాయవాదులు వాదించుటకు పూనుకొనగానే ఆయన మనస్సు విచలితము, విక్షుబ్ధమునై ఆయన "ఆరిభగవంతుడా! నేనిక ముందెన్నడూ సాక్ష్యములు విచారింపను," అని అరచెనట! ఆంగ్లేయుల ఉద్రేకరాహిత్య లక్షణమును గూర్చిన వినోదకరమైన ఎన్నో ఇట్టి ఐతిహ్యములు యూరప్‌లో ప్రచారములో ఉన్నవి. నేను ఒక అమిత సచ్ఛీలుడగు వ్యక్తి నెరుగుదును; బహుశః అతడు డెర్బీ పట్టణములోని ఒక మ్యాజిస్ట్రేట్ అనుకొందును; అత డొకనాడు 'మాలిబ్రాన్' చూచుటకు ఒక 'ఒపేరా' నాటకశాలకు వెళ్ళెను. ఒక రంగములో నాయిక ఒక శిథిలమైన వంతెనమీదుగా వడిగా నడచిపోవలసి యుండెను. ఆ ఘట్టము వచ్చుసరికి "బి" వ్యక్తి లేచి శాంతముగా, అయినను దృఢముగా ప్రేక్షకులను, నటులను కూడ 'తన నిర్ణయములో ఆ వంతెన భద్రముగాలే' దని హెచ్చరించెను. ఈ ఆంగ్లేయుని ఉద్రేకరాహిత్యము, నిదానము, ఫ్రెంచివారి

తెలివికి, నిపుణతకు సరిగా విరుద్ధమైన గుణములు. సాధారణముగా యూరప్ ఖండముపై ఇంగ్లీషువారి ప్రభావముకంటె ఫ్రెంచివారి ప్రభావము అధికమని చెప్పుకొందురు. ఆంగ్లేయులు నెరపు ప్రభావమంతయు పశుశక్తివలన, ఐశ్వర్యమువలన ఏర్పడినది; కాని, ఫ్రెంచివారి ప్రభావము సౌహార్ద్రసంబంధముల వలనను, వారి ప్రతిభవలనను ఏర్పడినది: ఇటాలియనులు సూక్ష్మబుద్ధి గలవారు; స్పెయిన్ వారు ద్రోహచింత గలవారు; ఎంతదారుణమైన హింసలైనను ఒక ఈజిప్టు దేశీయునుండి ఒక రహస్యమును బయటకు లాగలేవు. ఈ గుణాలలో ఏవీ ఆంగ్లేయునిలో లేవు. అతని పైత్యము—అతని ఊహపద్ధతిని పూర్తిగా బట్టబయలు చేయును. తన దేశీయుల స్వభావమును చక్కగా ఎరిగియున్న డీఫో వారిని గూర్చి ఇట్లు వ్రాసెను :

"చాటుచాటు కుట్రలు పన్ను శక్తి అరిది
తెలిసియున్నంతయును పైకి పలుకవలెను;
పథకమేదియు లేనట్టి శిథిలశీర్ణ
యత్నములు నిష్ఫలతలోనె యణగు తరచు
విజ్ఞు లందురు—మూలమ్ము ప్రిదిలియుంట
వారి విద్రోహములు జయప్రదము కావు
కల్ల కపటమ్మెరుగ కుంట, ఉల్లమందు
పొలిచెడి రహస్యములు పైకి పొక్కుచుంట."

"English Traits"

ఐదవ సంపుటమునుండి.

# మహాపురుషులు



మహాపురుషులలో మానవుని నమ్మకము స్వాభావిక మైనది. మన బాల్యమిత్రులు కొందరు మహావీరులుగా పరిణమించినచో, మహారాజభోగముల ననుభవించుచున్నచో అది మన కాశ్చర్యము కలిగింపదు. సర్వపురాణములు అర్ధదైవత మూర్తులతోనే ఆరంభమైనవి; అందలి సంఘటనలు ఉదాత్తములు, కవితామయములు; అనగా వారి ప్రతిభ సర్వోత్తమ మైనది. గౌతమునిగూర్చిన గాథలలో-ఆదిమానవులు మట్టిని భక్షించి, అది ఆస్వాద్యముగాను, మధురముగాను ఉన్నట్లు కనుగొనిన కథకలదు.

ప్రకృతి అద్భుతవ్యక్తుల కొరకేకల్పితమైనట్లుతోచును. ఈలోకము సత్పురుషుల ఋజువర్తన వలననే సాగుచున్నది; వారే ఈభూమిని పరిపూర్ణ శోభామయముగ జేయుచున్నారు. వారికి సమకాలికులుగ జీవించు ప్రజలకే జీవితము ఆనందమయముగాను, బలవర్ధకముగాను కన్పట్టుచున్నది. అట్టి సమాజమందు మనకుగల విశ్వాసమే మన జీవితమును మధురముగను, సహ్యముగను చేయుచున్నది; వాస్తవికముగానో, మానసికముగానో మనము మనకంటె అధికులగు వారితో కలసి జీవించుచున్నాము. మనము మన బిడ్డలకు, మన భూములకు వారిపేర్లు పెట్టుకొనుచున్నాము. వారిపేర్లు భాషలలో ధాతువులుగా పరిణమించుచున్నవి; వారికృతులలో,

ప్రతికృతులో మన గృహాల నలంకరించుచున్నవి. ప్రతి సైనిక సంఘటనయు వారికి సంబంధించిన ఒక ఐతిహ్యమును జ్ఞప్తికి తెచ్చుచున్నది.

మహాపురుషాన్వేషణమునుగూర్చియే బాల్యములో మానవుడు కలలుగనును; వ్యక్తివచ్చిన తర్వాత దానిని గూర్చియే అత్యంత తీవ్రముగ కృషిచేయును. ఆమహాపురుషుని కార్యములను దర్శించుటకై, వీలైనచో ఆతని దర్శనముకూడ చేసికొనుటకై మనము విదేశములకు యాత్ర పోవుదుము. కాని, మహాపురుషుని బదులు అదృష్టము మనకెదురై మన కృషిని మరొకత్రోవ పట్టించును. ఆంగ్లేయులు లోకవ్యవహారదక్షులనీ, జర్మనులు మంచి ఆతిథేయులనీ, వాలెన్షియా (తూర్పుస్పెయిన్‌లో రాష్ట్రము; నగరము) లో శీతోష్ణస్థితి చాల ఆహ్లాదకరముగా ఉంటుననీ, సాక్రమెంటో (కాలిఫోర్నియా) కొండలలో బంగారు గనులున్నవనీ – ఇట్లు మీారెన్నైన చెప్పుడు. అంతమాత్రాన నేను–సుఖభోగములతో తులతూగు ప్రజలనుగాని, మంచి ఆతిథేయులైన ప్రజలను గాని, స్వచ్ఛాకాశమునుగాని, విలువైన బంగారు కణికలను గానిసందర్శించుటకై యాత్రబయలు దేరను. కాని, సహజముగా సంపన్నులు,శక్తిమంతులుఅగువ్యక్తులుగల దేశములవంకకూ, గృహములవంకకూ ముల్లుచూపగల సూదంటురాయి ఒకటి ఉన్నచో నేను నా సర్వస్వముఅమ్మియైన తత్సందర్శన భాగ్యమును విలుచుకొనుటకై వెనుదీయను; క్షణములో

నేనొక యాత్రికుడనైపోయి, ఆదిక్కుగా ప్రయాణము సాగింతును.

మహాపురుషులవలన వారు జన్మించిన జాతుల పరపతి అధికమగును. ఒకానొక నగరములో రైలురోడ్డును కనిపెట్టిన వ్యక్తి ఉన్నాడన్న జ్ఞానము ఆనగరపౌరుల పరపతిని పెంచును. అంతేకాని, అధికసంఖ్యలో ఉన్న జనాభా – అందులోను వారిలో ఎక్కువమంది బిచ్చగాండ్రయినచో – చరించు మాంసపు ముద్దలవలె, చీమల పుట్టవలె, ఈగల గుంపువలె కేవలము వారు రోతనే కలిగింతురు. అట్టివారు ఎంత ఎక్కువమంది ఉన్న అంత చెరుపే!

మహాపురుషులను ప్రేమించుటే, సంస్మరించుటే మన మతము. ప్రాచీన గాథలలోని దేవతలందరూ మహాపురుషులే! జీవితములలోని ఉజ్జ్వల క్షణముల ప్రతిబింబములు వారు. మనము మన యానపాత్రల నన్నిటిని ఒకే మూసలో తయారుచేసికొన్నాము. యూదు, క్రైస్తవ, బౌద్ధ, మహమ్మదీయాది బ్రహ్మాండమైన మన ఆస్తిక మతము లన్నీ మానవ మేధయొక్క అవశమైన నిర్మాణాత్మక కృషికి ఫలితములు. చరిత్ర నభ్యసించు విద్యార్థి గుడ్డలకొరకో, తివాచులకొరకో, ఒక దుకాణములో ప్రవేశించు వ్యక్తివంటివాడు. అతని కక్కడ ఒక క్రొత్తసరుకు దొరకునని అతడు ఆశించును. కాని, తీరా కర్మాగారము లోనికి వెళ్ళిన తరువాత తా నాశించిన క్రొత్తసరుకులు తీబ్జ్ (గ్రీస్) పిరమిడులలో ఆంతర

కుడ్యాలమీది కాగితపుచుట్టలకూ, కృత్రిమమైన గులాబి పూలకూ (రోజెటీ) నకళ్ళే నని అతడు తెలిసికొనును. మన ఆస్తికవాదము మానవమేధను పూళించిన మొనర్చు సాధనము. మానవుడు మానవుని తప్ప మరి దేనిని చిత్రింపలేడు; నిర్మింపలేడు; భావింపలేడు. జగత్తులోని మూల ద్రవ్యములన్ని తన ఊహనుండి ఆవిర్భవించినవే అని అతడు విశ్వసించును. ఇక మన తత్త్వశాస్త్రము సంకలితముగానో విభక్తముగానో ఉన్న సారభూతమైన ఒకేఒక పదార్థమును అన్వేషించును.

ఇతరులనుండి మనము ఎన్నివిధములైన ప్రయోజనములను పొందుచున్నామో ఆలోచించు సందర్భములో ఆధునిక వివేచనాపద్ధతుల బారిని పడు ప్రమాదము నుండి జాగరూకత వహించవలెను; అందుచే అల్పారంభము చేయుట మంచిది. 'ప్రేమ' విషయములో విరుద్ధముగా వాదించుటకు గాని, ఇతరుల విస్పష్టమైన అస్తిత్వమునే కాదనుటకుగాని మనము పూనుకొనరాదు. ఇతరులు లేకున్న మన మెట్లు బ్రతుకగలమో నా కర్థముకాదు. మనకు సాంఘికబల మున్నది. ఇతరులపట్ల మన అనురాగము మరే ఇతరవిధమునను మనకు సమకూడని ఒక విధమైన అద్భుత లాభమును, లేక ప్రతిఫలమును మనకు చేకూర్చును. నేను ఒంటరిగా సాధింపలేని ఒక పనిని మరొకనితో కలసి సులభముగా చేసివేయగలను. నాలో నేను మొదట చెప్పుకోలేని కొన్ని సంగతులను నీతో చెప్పివేయగలను. మన మనస్సు

లను మనము చదువుకొనుటకు ఉపయోగపడు భూతద్దముల వంటివారు ఇతరులు. ప్రతివ్యక్తి తనకంటె భిన్నలక్షణములు గలవారి కొరకై అన్వేషించుచుండును; అట్టి భిన్నలక్షణ లక్షితులైనవారిలో గూడ అత్యుత్తముల నన్వేషించుచుండును. అనగా ప్రతివ్యక్తి ఇతరులకొరకు, ఆ ఇతరులలో ఉత్తముల కొరకు అన్వేషించుచుండు నన్నమాట! ప్రకృతి ఎంతఎక్కువ శక్తిమంతమైన అంత ఎక్కువగా అది ఎదురొత్తు లిచ్చును. మనము పరిశుద్ధమైన మేలిరకమైన వస్తువునే పరీక్షింతము; ప్రతిభాలవదుర్విదగ్ధులను మనము పట్టించుకొనవద్దు. మానవులలో ఒక ప్రధాన భేదము—వారు తమ స్వవిషయములపట్ల శ్రద్ధవహించుచున్నారా లేదా అను విషయముమీద ఆధారపడి ఉండును. లోపలనుండి బయటకు పెరిగివచ్చు తాటిచెట్టు వంటి ఉదాత్తమైన అంతర్వర్ధిష్ణు (Endogenous) వృక్షముల జాతికి చెందినవాడు మానవుడు. ఇతరులకు అది అసాధ్యమైనను, తాను చేయు పనిని అతివేగముగ, అవలీలగ, అతడు చేసివేయును. పంచదార తాను తీయగా నుండుటకు, ఉప్పు తాను ఉప్పగా ఉండుటకు ఏమీ శ్రమ పడనక్కరలేదు. తనంతతానుగా మన చేతులలో వచ్చి వ్రాలునట్టి దాని కొరకై మనము దారిప్రక్కన పొంచి, వల పన్ని నానా యాతనలూ పడుదుము. ఇతరులు చాల శ్రమకోర్చి అతి కష్టముమీదగాని అధిరోహింపలేని ఉన్నతభావనా పథములో సదా సంచరించు వానిని నేను గొప్పవాడని అందును. వస్తు

వులను యథాతథముగా, వాటి మధ్యగల విస్తృత సంబంధా లతో సహా దర్శింపగలుగుటకు అతడు కేవలము కన్నులు విప్పి ఆ వస్తువులపై దృష్టి సారించిన చాలును; వేరేమియు చేయనక్కరలేదు. అదే ఇతరులు చేయవలెనన్నచో భ్రమా ప్రమాదాల విషయమున అత్యంత జాగరూకతతో ముందు నకు సాగుచు, తప్పులు చేయుచు, దిద్దుకొనుచు, చాల శ్రమ పడవలసి యుండును. అతడు మనకు చేయు సేవకూడ అట్టిదే! ఒక అందమైన వ్యక్తి తన అందమును మన కనులలో ముద్రించుటకు ఎట్టి శ్రమయు పడనవసరము లేదు. అట్లే- ఒక వివేకవంతునకు తన వివేకము నితరుల కందించుటలో ఎట్టి శ్రమయు ఉండదు. ప్రతివ్యక్తి తాను చేయగల అత్యంత ఘనకృత్యమును అత్యంత సులభముగా చేసి వేయగలడు. "పోయ్ దమొయాఁ బుకోదఫట్" (అల్పపరిక రాలతో అధికఫలితములను సాధించవలెను) అని ఫ్రెంచ్ లోకోక్తి. ఎవడు స్వభావముచేతనే ఆవిధముగా ఉండెనో, ఎవడు ఇతరులను మనకు ఎన్నడూ జ్ఞాపకము చేయడో అతడే గొప్పవాడు.

కాని, అతడు మనకు సంబంధించినవాడై ఉండవలెను; మన జీవితాలలో మనకు తెలియనిదానిని దేనినో అతడు వివరించిచెప్పునను ఆశ మనకు కలుగవలెను. నేను ఏమి తెలిసికొనగోరుచున్నానో నేను చెప్పలేను. కాని, కొందరు వ్యక్తులను నేను గమనించితిని: తమ స్వభావముచేతను, చర్యలచేతను నాకు అడుగుటకు శక్తిచాలని ప్రశ్నలకుగూడ

వారు సమాధానము లిత్తురు. ఒకవ్యక్తి తన సమకాలికు లెవ్వరూ అడిగియుండని ఏదో ఒకప్రశ్నకు జవాబు చెప్పును; అంతలో అతడు విలక్షణుడగును. అప్లై-గత, వర్తమానమత ములు, తత్త్వశాస్త్రములు మరికొన్ని ప్రశ్నలకు జవాబు చెప్పును. కొందరు వ్యక్తులు మనలో ఎన్నెన్నో ఆశలు రేకెత్తింతురు; కాని వారు తమకు తాముగాని, తమ యుగమునకుగాని సహాయపడజాలకుందురు. బహుశః అట్టి వారిని సృజించుట ఆ యుగపు వాతావరణములోని ఒకానొక ప్రవృత్తియొక్క వినోదక్రీడయేమో! వారు మన అవసరము లను తీర్చువారు కారు. నిజముగా గొప్పవారు నిత్యసన్ని హితులుగా నుందురు; వారిని చూపులోనే మనము పోల్చుకో గలము. మన నిరీక్షణను సఫలమొనర్చి వారు సముచిత స్థానమును ఆక్రమింతురు. మంచివస్తువు ఎప్పుడును శక్తి మంతము, ఉత్పాదకము అయియుండి, తనకు తగిన స్థాన మును, వర్ధిల్లుట కావశ్యకమగు ఆహారమును, మిత్రులను స్వయముగ సంపాదించుకొనజాలి యుండును. మంచి ఆపిల్ పండు విత్తనము నిచ్చును; కల్తీజాతి ఆపిల్ పండు ఇవ్వదు. ఒకవ్యక్తి ఉచితస్థానము నాక్రమించెనా - ఇక అతడు నిర్మా ణాత్మకము, సారవంతము, సూదంటురాయివలె ఆత్యాకర్ష కము అయినలక్షణములు కలిగి సైన్యాలనే తనఆశయముతో ఆవేశింపజేసి, తన్ముఖమున ఆ ఆశయమును సాధించుకొన గలుగును. నది తనగట్లను తానే రూపొందించుకొనును. ధర్మవిహితమైన ప్రతిభావమూ తనంత తానే త్రోవచేసికొని

సర్వత్ర ఘనస్వాగతములను సంపాదించుకొనును; తన పరిపోషణకు ఆహారమును, తన ప్రచారమునకు సంస్థలను, తన ప్రతిస్పర్థుల నెదుర్కొనుటకు ఆయుధాలను, తన వివరణమునకు శిష్యులను ఆ భావమే సమకూర్చుకొనును. నిజమైన కళాస్రష్ట ఒక గ్రహమును తాను పైకెగురుటకు వీలగు ఆధారభూమిగా చేసికొనును; సాహసకృత్యాన్వేషి (Adventurer) కి ఏండ్లు పూండ్లు శ్రమపడినను చివరకు తన చెప్పులు మినహా వేరేమియు మిగులవు.

సాధారణముగ మనము మనకంటె అధికులగువారి నుండి మనము పొందగల రెండువిధములైన లాభాలను, లేక సేవలను గుర్తింతుము. ఒకటి: ప్రత్యక్షము; రెండు: పరోక్షము. ప్రత్యక్ష లాభ సంధానములోనే ఆదిమ మానవులు విశ్వసించిరి; ఆరోగ్యము, శాశ్వతయౌవనము, సునిశిత పంచేంద్రియశక్తి, రోగనివారణ విద్యలు, మాంత్రికశక్తి, భవిష్యద్వృత్త కథనము వంటి ఆధిభౌతికమో, ఆధ్యాత్మికమో అయిన ప్రత్యక్ష లాభములనే తమకంటె అధికులగు వారినుండి వారు ఆశించిరి. బాలుడు తనకు వివేకమును విక్రయింపగల ఉపాధ్యాయు డొకడున్నాడని నమ్మును. అల్ప-మతసంస్థకు సంక్రాంత గుణములలో విశ్వాసము గలదు. కాని, నిజమునకు ఇట్టి ప్రత్యక్ష లాభ సంధానమును మనము గుర్తించుటలేదు. మానవుడు అంతర్వర్ధిష్ణు జంతువు; విద్య అతనిలోనే వికసించు ద్రవ్యము. ప్రకృతి మనలో ఆవిష్కరించు విషయములతో పోల్చి చూచినచో ఇతరులనుండి

వ్యసనము పొందు సహాయము కేవలము యాంత్రికమైనది. ఆవిధముగ నేర్చుకొనిన విద్య కార్యరూపము దాల్చినప్పుడే ఆనంద సంధాయకమగును; 'కారణము' కాక 'కార్యమే' నిలచియుండునది. సరియైన నీతి కేంద్రస్థితము; ఆత్మాధీనమే అది జయటకు తెలుపదును. దానమనునది విశ్వప్రకృతికి విరుద్ధమైనది. ఇతరులకు సేవచేయుట మనకు సేవ చేసికొనుటే! నాకొరకే నేను నన్ను విముక్తుని చేసికొనవలెను. ఆత్మ ఇట్లనును: "నీపని నీవు చక్కబెట్టుకొనుము. ఓయి మూర్ఖుడా! ఆకాశముజోలి, ఇతరుల జోలి నీకెందుకు?" ఇక-రెండవది పరోక్షసేవ. మూర్తీభవనశక్తి, లేక ప్రతినిధీభవనశక్తి మానవుల కున్నది; అదే మన మేధల వికాసమునకు ఉపకరించును. జెహ్మాన్, స్వీడెన్‌బర్గ్ (1688-1772; స్వీడిష్ శాస్త్రవేత్త, తత్త్వవేత్త, మతవిషయిక రచయిత) లు వస్తువు లన్నియు ప్రతినిధులవంటివని గుర్తించిరి. మానవులు కూడ ప్రాతినిధ్యలక్షణము గలవారే. మొదట వస్తువులకు, పిమ్మట భావములకు వారు ప్రాతినిధ్యము వహింతురు:

చెట్లు ఖనిజములను జంతువులకు అనువైన ఆహార పదార్థముగా మార్చివేయునట్లు మానవుడు ప్రకృతిలోని కొంత ముడిపదార్థమును మానవోపయోగకరద్రవ్యముగా మార్చుచుండును. నిప్పును, విద్యుచ్ఛక్తిని, అయస్కాంతిక శక్తిని, ఇనుమును, సీసమును, గాజును, మైనపుగుడ్డను, సిల్కు, నూలుగుడ్డలను కనిపెట్టినవారూ, మన పనిముట్లను నిర్మించినవారూ, దశాంశగణనమును కనిపెట్టినవాడూ, రేఖా

గణితజ్ఞుడూ, ఇంజనీరూ, గాయకుడూ—అందరూ అజ్ఞాతము, అగమ్యగోచరము అయిన పరిస్థితులను గడచి బయటపడుటకు సులభములైన మార్గములేర్పరచి వివిధరీతులలో అందరికీ సహాయపడుచున్నారు. ప్రతి మనుష్యుడూ అతనిలో గుప్తముగనుండు ఒక ఇష్టము కారణముగా ప్రకృతిలోని ఏదోఒక భాగముతో అనుబద్ధుడైయుండును; ఆ భాగమునకే అతడు ప్రతినిధిగాను, వ్యాఖ్యాతగాను తయారగును. ఉదాహరణకు లిసియస్ * కు వృక్షాలతోను, హ్యూబర్ కు తేనెటీగలతోను, ఫ్రైస్ కు 'లైకెన్' మొక్కలతోను, వాన్ మాన్స్ కు 'పేర్' (Pears) పళ్ళతోను, డాల్టన్ ♦ కు పరమాణు స్వరూపములతోను, యూక్లిడ్ ǂ కు రేఖలతోను, న్యూటన్ § కు నిరంతర సంచలనములతోను (Fluxions)అట్టి గుప్తానుబంధమున్నది.

మానవుడు ప్రకృతికొక కేంద్రమువంటివాడు; అతడు తననుండి బాంధవ్యసూత్రములను అన్ని దెసలకూ, అన్ని పదార్థములగుండా,— ఘనద్రవపదార్థాలగుండాను, మూల, మిశ్రపదార్థాలగుండాను కూడా— అల్లుకొనుచుండును. భూమి గుండ్రముగా తిరుగును; దానిమీది ప్రతిమట్టిపెల్ల, ప్రతిరాయి

* స్వీడిష్ వృక్షశాస్త్రజ్ఞుడు - 1707 - 1778.

♦ ఇంగ్లీష్ భౌతిక, రాసాయనిక శాస్త్రజ్ఞుడు. 1716 - 1884,

ǂ గ్రీస్ లోని అలెగ్జాండ్రియావాసి; రేఖాగణితశాస్త్రజ్ఞుడు; క్రీ. పూ. 300

§ ఇంగ్లీష్ తత్త్వవేత్త; గణితశాస్త్రజ్ఞుడు- 1642- 1727

ఎప్పుడో ఒకప్పుడు మధ్యాహ్నబిందువు [Meridian] వద్దకు వచ్చును. ఇట్లే - ప్రతి అవయవము, ప్రతి పని, ప్రతి అస్త్రము, ప్రతిస్ఫూర్తికము, ప్రతిధూళికణము ఏదో ఒక విధముగా మానవ మేధతో సంబంధమును సంపాదించును. అది చిరకాలము నిరీక్షింపవలసి రావచ్చును. కాని ఎప్పుడో ఒకప్పుడు దానివంతు వచ్చును. ప్రతిమొక్కకు దానిపై ఆధారపడి బ్రదుకుప్రాణి దానికి ఉండనే ఉండును; సృష్టింపబడిన ప్రతివస్తువునకు దాని ప్రేమికుడు దానిని అభివర్ణించు కవి దానికి లభింపనే లభించును. ఆవిరికి, ఇనుమునకు, కలపకు, బొగ్గుకు. అయస్కాంతమునకు, అయొడిన్‌కు, వరికి, ప్రత్తికి ఇప్పటి కప్పుడే న్యాయము జరుగనే జరిగినది; కాని, మన కళలవలన ఇప్పటికి ఎంతో కొద్ది ద్రవ్యజాతమును మాత్రమే మనము ఉపయోగములోనికి తెచ్చుకోగలిగినాము. సృష్టిలో ఎన్నెన్నో వస్తువులూ. గుణములూ ఇంకను గుప్తములుగానే నిరీక్షణాదశలోనే నిలచిపోయి ఉన్నవి. సాంప్రదాయికకథల (Fairy tales) లోని మంత్రబద్ధలైన రాకుమార్తెలవలె ప్రతి వస్తువూ దాని నిర్వ్రతివిమోచకుని ఆగమనముకొరకు నిరీక్షించుచున్నట్లుండును. ఎప్పుడో ఒకప్పుడు ప్రతివస్తువునకు శాప విమోచనమై మానవాకారములో అది వెలుగులోనికి రాకతప్పదు. ఇంతవరకు జరిగిన ఆవిష్కరణముల చరిత్రను పరిశీలించినచో-అంతర్నిహితమైన ఒకసత్యము పరిపక్వదశను పొందినప్పుడు తన ఆవిష్కరణమునకై తానే ఒక మానవ మేధను తయారు చేసికొనుచుండినట్లు వ్యక్తముకాగలదు. ఏ

గిల్బర్ట్లోనో, స్వీడెన్‌బర్గ్‌లోనో, ఓర్‌స్టెడ్ (డేనిష్ భౌతిక శాస్త్రజ్ఞుడు) లోనో అయస్కాంతము మొదట మానవాకారము స్వీకరించినగాని దాని శక్తులను సర్వమానవులు ఉపయోగించుకొనుటకు అవకాశము గలుగలేదు.

మనము పైపై ప్రయోజనాలతో ఆగిపోదలచుకొన్నచో-ఖనిజ, వృక్ష జగత్తులలో గంభీరమైన శోభ మొదట మనకు ప్రత్యక్షమగును. ఆ శోభ కొన్ని అనుకూల క్షణాలలో ప్రకృతి సోయగముల రూపమున బహిర్గతమగును. లోహేతర ఖనిజముల తళతళలు, ఏకజాతి వృక్షముల మధ్య నిశ్చితరూపమున కనవచ్చు సాదృశ్యము, ప్రకృతి రేఖల మధ్యగల కోణముల విస్పష్టత అట్టివే! వెలుతురు, చీకటి, వేడిమి, చల్లదనము; ఆకలి, ఆహారము, తీపి, పులుపు, ఘన, ద్రవ, వాయుస్థితులు:-అన్నీ సుఖముల పూదండలతో మనలను పరివేష్టించి యుండును. అభిలషణీయములైన వాటి పరస్పర వైరుధ్యాలతో అవి మానవజీవితమునేపగటికిమాయ చేసి క్షణములో గడపివేయును. మనకన్ను అనుదినము వస్తువులను గూర్చి "అవి మంచివని అతడు కనుగొనెను" అను స్తోత్రపాఠమును పునశ్చరణ చేయును. ఇట్టిశోభలను ఎక్కడ మనము దర్శింపగలమో మన మెరుగుదుము. అభినయకౌశలములో ఆరితేరిన వివిధ జాతుల వస్తువులతోడి అనుభవము మనకు కొంచెము ఏర్పడినచో ఆ ప్రదర్శకుల ప్రదర్శనాలను మనము మరెంత ఎక్కువగా ఆస్వాదింప గలుగుదుము. కాని ఇంతకంటె ఘనతరములైన ప్రయోజనాలను పొందు అధి

కారము మనకున్నది. శాస్త్రవిజ్ఞానము మానవత్వ పరిపూర్ణము కానిచో దానిలో ఏదో కొంతలోపము కనిపించుచునే యుండును. కేవలము ఘాతాంకము (లోగరిథము) ల పట్టికలు తయారుచేసికొనుట వేరు; వృక్ష, గాన, నేత్ర, వాస్తు శాస్త్రాలలో ఆ పట్టికలు ఎంతగానో ఉపయోగమునకు వచ్చుట వేరు. సంఖ్యా, శరీరనిర్మాణ, వాస్తు,ఖగోళ శాస్త్రములు చాల అభివృద్ధిపొందినవి; ఆ అభివృద్ధి మానవునకు ఎంతప్రయోజనకరమో మొదట ఎవ్వరునూ గుర్తింపలేదు; కాని, మానవ మేధతోను, సంకల్పముతోను ఆ శాస్త్రములు సమ్మేళనము చెంది, అవి మనజీవితములలోని కెగబ్రాకి, మన సంభాషణలలో, ప్రవర్తనలో రాజకీయాలలో తిరిగి సాక్షాత్కరించినవి.

కాని, ఈ విషయము తరువాత ఆలోచింపవలసినది. ప్రస్తుతము వాటి స్వకీయస్థానాలలో వస్తువులతో మనకు గలుగు పరిచయమును గూర్చి, ఎవడో ఒక ప్రతిభాశాలిని మురిపించి, ఆకర్షించి వాని జీవిత సర్వస్వము ఏదో ఒక వస్తువును గూర్చిన పరిశోధన కంకిత మొనర్చునట్లు చేయు ఆ వస్తువుల విచిత్రవిధానములను గూర్చి మాత్రమే మనము మాట్లాడుకొందము. పరిశీలకుడు పరిశీల్యవస్తువుతో ఐక్యము పొందగలిగినప్పుడే ఆ వస్తు వ్యాఖ్యానము సుసంభవమగును. జగత్తులో ద్రవ్యరూపమగు ప్రతివస్తువునకు దివ్యతా సంబంధియగు మరొక పార్శ్వము కూడ నుండును. మానవత్వము ద్వారా అది ఆధ్యాత్మిక, ప్రయోజనకర జగత్తులోనికి

అనూదిత మగును; అక్కడ అది ఇతర సర్వపదార్థాలతో సమముగా అనశ్వరపాత్రను నిర్వహించును. మరియు-సర్వ పదార్థములు తమకు లక్ష్యభూతమైన ఈ దశను ప్రాపించుటకై నిరంతరము పైకి ఎగప్రాకుచునే యుండును. వాయుపదార్థ ములు ఆకాశమువంకకే సాగుచుండును; రాసాయనిక ద్రవ్య ములు మొక్కల కుదుళ్ళను జేరి, వాటితోపాటు పెరుగు దల సాధించుచుండును; చతుష్పాత్తులను చేరి వాటిలో నడక నేర్చుకొనును; మానవునిలో చేరి భావనాశక్తి గడించును; మరి-నియోజకవర్గము మీద కూడ ఒక ప్రతి నిధికి రాగల వోట్ల సంఖ్య ఆధారపడియుండునుగదా! జగత్తు లోని వస్తువులు కేవలము ప్రతినిధులే కావు; భాగస్వాములు కూడ. ఒక వస్తువును తత్సదృశవస్తువు మాత్రమే తెలిసికొన గలదు. మనము ఒక వస్తువునకు సంబంధించిన వారమగుట వలననే, అంతవరకు ప్రకృతిలో లేక ఆ వస్తువులో ఒక భాగముగాఉండి అప్పుడే బయటకువచ్చినవారమగుటచేతనే, ఆ వస్తువును మనము తెలిసికొనగలుగుచున్నాము. ప్రాణి రూపము దాల్చిన క్లోరినే (హరిదము)ద్రవ్యరూపమైన క్లోరిన్ (హరిదము)ను తెలియగలుగుచున్నది; అట్లే మానవావతార మెత్తిన తుత్తునాగమే తుత్తునాగపు స్వభావము నెరుగజాలు చున్నది. ఆయావస్తువుల స్వభావమే అతని జీవనమార్గమును నిర్ణయించుచున్నది; అతనిలో ఆ ద్రవ్యము లుండుట వలన వాటి గుణములను వివిధరీతుల నతడు ప్రకటింపగలుగును. జగత్తులోని ధూళితో నిర్మితుడైన మానవుడు తన మూల

మును విస్మరింపను; నేటికిని ప్రాణరహితముగ నున్న సర్వ
మును ఎప్పుడో ఒకప్పుడు మాటలాడును, వాదించుట చేసి
తీరును. అప్రకటితముగ నిలచియున్న ప్రకృతి భవిష్యత్తులో
తన సర్వ రహస్యములను వ్యక్త మొనర్చుట తప్పదు.
గ్రొవ్వెరాళ్ళ పర్వతాలు ఎప్పటికో ఒకప్పటికి శీర్ణశీర్ణ
ములై అసంఖ్యాకులైన 'వెర్నర్' లు గాను, 'వాన్ బుక్'లు
గాను, 'బ్యూమాంట్' లు గాను విడిపోవునని మనము నమ్మ
వచ్చును. అట్లే ఈ వాతావరణమను ప్రయోగశాల తుది
పరిష్కార సందర్భమున ఎందరు 'బర్జీలియస్' (స్వీడిష్
రసాయన శాస్త్రవేత్త-1779-1848) లను, ఎందరు 'డేవీ'
(ఆంగ్లరసాయన శాస్త్రజ్ఞుడు-1778-1829) లను ప్రసాదింప
నున్నదో ఎరుగము.

ఈవిధముగా మనమొక మహాగ్ని ప్రక్కన కూర్చుని
యున్నాము; భూధ్రువమ్ములమీద నిలచియున్నాము. మన
ఈ సర్వవ్యాపిత్వము వంటి స్థితియే మన దౌర్బల్యమునకు
కారణమగుచున్నది. భూ, దివమ్ములు కలసికొని, పరస్పరము
భూషణాయమానమగు దివ్యదినమున అట్టిదినము మనకు
తిరిగి తిరిగిరాకుండుట మన దురదృష్టమనిపించును. మనకు
వేయితలలు, వేయిశరీరములు ఉన్నచో అద్భుత సౌందర్య
నిధానమైన ఆదినము అనేకవిధాలుగా, అనేకస్థలాలలో గడపి,
ఆనందించి యుందుముగదా అనిపించును. ఈఊహ కేవలము
స్వప్నమువంటిదేనా? కాదు. మనము నమ్మవలెనుగాని,
నిజముగ మన ప్రతినిధులచే మనము బహుధాకరింప

బడుదుము. మహాపురుషుల శ్రమఫలములను ఎంతో సులభ ముగ వాడుకచేసుకొందుము. అమెరికాకువచ్చు ప్రతి ఓడకు మార్గదర్శకపటము కొలంబస్ ఇచ్చినదే! ప్రకటితమగు ప్రతి నవలయు హోమర్ (క్రీ. పూ. 1200-850 మధ్య ఎప్పుడో జీవించిన గ్రీకుకవి; 'ఇలియడ్' 'ఓడెస్సే' అను రెండు జగద్విఖ్యాత పురాణాలను రచించెను.)కు ఋణపడియున్నది. బాడిసెనుపయోగించు ప్రతివడ్రంగీ విస్మృతుడైన ఆ బాడిసె నిర్మాత ప్రతిభను ఎరువుతెచ్చుకొనుచున్నాడు. చుట్టును పరివేష్టించియున్న వివిధశాస్త్ర మండలము ఓడను లంగరు త్రాళ్ళవలె మానవజీవితమును పట్టియుంచుచున్నది. ఆశాస్త్ర ములన్నీ - మన ఆకాశములోనికి క్రొత్తవెలుగును ప్రసరింప జేయు నిమిత్తమై తాము ఆహుతిఅయిపోయిన గతకాల మహాపురుషులు మనకు ప్రసాదించినవి. ఇంజనీరు, బ్రోకరు, న్యాయశాస్త్రవేత్త, వైద్యుడు, నీతిబోధకుడు, మతప్రచార కుడు, ఒకటేమిటి ప్రతిశాస్త్రవేత్తా మనపరిస్థితిని నిర్వచించి, దానికి అక్షాంశ, రేఖాంశాలతో ఒకపటమును తయారు చేయుచున్నవాడే! ఈ రహదారులు వేయువారు సర్వవిధ ముల మనలను సంపన్నులను చేయుచున్నారు. మనము జీవన వైశాల్యమును పెంపొందించుకొని, మన సంబంధాలను విస్తరింపజేసుకోవలెను. సనాతనమైన ఈ భూమిమీద క్రొత్త ఆస్తిని సంపాదించుటవలన గూడ ఒక క్రొత్త గ్రహమును ఆక్రమించుకొనుటవలన కలుగునంతటి లాభము మనకు కలుగును.

ఈ భౌతిక, లేక అర్ధభౌతిక ప్రయోజనాలను స్వీకరించుటలో మనము చాల జాప్యము చేయుచున్నాము మనము బరువైన సంచులవలె, నిండిన కడుపులవలె కదల లేకుండ నుండరాదు. ఒక మెట్టుపైకి ఎక్కుటకు సహాను భూతి అను గుణము మన కెక్కువ సహకరించును. చురుకు దనము సాంక్రామికము. ఇతరులు చూచు వస్తువులను చూచుట ద్వారా, ఇతరులు భాషించు వస్తువులతో భాషించుటద్వారా ఆ ఇతరులను ఆకర్షించిన ఆ సొగసులను మనముకూడ దర్శింప గలుగుదుము. నెపోలియన్ ఇట్లనెను: ''ఒకే శత్రువుతో నీవు తిరిగి తిరిగి యుద్ధము చేయరాదు. అట్లు చేసినచో నీకు తెలిసిన యుద్ధకళ నంతనూ అతనికి నేర్పివేసినవాడ వగుదువు'' శక్తిమంతమైన మనస్సు గల ఒక వ్యక్తితో ఎక్కువసేపు మాట్లాడితిమేని, అతడు వస్తువు లను చూచు ధోరణి మనకు అతివేగముగ పట్టుబడును; ప్రతిసంఘటన విషయములోను అతని ఆలోచన లెట్లుండునో ముందుగా మనము ఊహింప గలుగుదుము.

మానవులు తమ మేధలద్వారా, అనురాగముల ద్వారామాత్రమే పరులకు సహాయపడగలరు. ఇతరవిధము లైన సహాయము నాకు సహాయాభాసముగా కనిపించును. నీవు నాకు రొట్టె, వెచ్చని కుంపటి ఇచ్చుచున్నట్లు భావించు చున్నచో, దానికి పూర్తిపరిహారము చెల్లించుచుంటినని నేను భావింతును. చిట్టచివరకు ఆ సహాయము ఏపరిస్థితిలో నన్ను చేరినదో, ఆ స్థితిలోనే నన్ను వదలిపోవును. నాస్థితి బాగుపడు

టగాని, దిగనాసిల్లుటగాని జరుగదు. కాని, మానసిక, నైతిక శక్తి విస్పష్టముగ మంచినే కలిగించును. అది నీనుండి వెలువడి నీవు సంకల్పించినను సంకల్పించకున్నను నీయూహలో కూడ ఎన్నడూ స్ఫురించియుండని లాభము నాకు చేకూర్చును. దృఢమైన సంకల్పము లేనిదే ఏవిధమైన బలముగాని, ఘన కార్యములను సాధించుశక్తిగాని కలుగునని నేను నమ్మలేను. మనుష్యుడు సాధింపగలిగిన దాని నంతటిని మనముసాధింప గోరుదుము. సర్ వాల్టర్ రాలీ (1552-1618; ఆంగ్ల రాజ్య పాలనాదక్షుడు, రచయిత)నిగూర్చి సెసిల్ (1520-1578, ఆంగ్లపాలనాదక్షుడు) చెప్పిన "అతడుచాల ఎక్కువశ్రమపడగల డని నేనెరుగుదును." అను మాట మనకు విద్యుదాఘాతము వలె తగులును. క్లారెండన్ (ఆంగ్లచరిత్ర రచయిత; 1609 - 1674) తన చిత్రణలలో హాంప్డెన్ (ఆంగ్లరాజ్యపాలనాదక్షుడు; 1594-1643) ను గూర్చి వ్రాసిన "అతడు- చాల శ్రమతో గూడిన పనులుగూడ అలసట కలిగింపలేనంతటి దక్షత, నిరంతర జాగరూకత గలవాడు; అత్యంత నిశితమైన ప్రజ్ఞలచే కూడ అధఃకరింపబడని గొప్ప ప్రజ్ఞగలవాడు. ఆ ఉత్తమ ప్రజ్ఞలతో సరితూగగలధైర్యసాహసాలుగూడ అతనికిగలవు." అను మాటలును, ఫాక్ లండ్ నుగూర్చి వ్రాసిన "దొంగతనము నకుగాని, వంచనకుగాని ఎంతమాత్రము అవకాశమీయని కఠోరసత్యవ్రత నిరతుడు" అను మాటలునుగూడ అట్టివే! మన రక్తములో సంచలనము కలుగకుండ ప్లూటార్క్ రచన లను మనము చదువలేము. "ఒక ఋషి ఒక వందయుగాలకు

సరిపోవు ప్రబోధము కలుగజేయును. 'లూ'నడవడికనుగూర్చి విన్నచో పరమమూర్ఖుడు పండితుడగును; సంశయాత్ముడు నిశ్చయజ్ఞానము గలవాడగును.'' అన్న మెన్షియస్ (చీనా తత్త్వవేత్త-క్రీ. పూ. 372–289)సూక్తిని నేనామోదింతును.

ఇది నైతికశక్తినిగూర్చిన చరిత్ర. అయినను, వర్తమాన జీవులపై సమకాలికుల ప్రభావమున్నంతగా గతజీవుల ప్రభావము ప్రసరింపజాలదు; ఈ సమకాలికులపేర్లు ఆ గతజీవుల పేర్లంత ఎక్కువకాలము నిలువలేకపోయిననూ సరే! నేను ఏకాంతముగ నున్నపుడెల్ల అద్భుతవిధానాల ద్వారా నా ప్రతిభను పోషించుచు, నాకు ఉద్దీపనము కలిగించుచు, నన్ను సమీపించు వ్యక్తులు నాకు ముఖ్యముగాని, నాఊహాలోకూడ ఎన్నడూ మెసలని వ్యక్తితో నాకేమిపని? ఇతరుని గమ్యమును ఆ ఇతరునికంటె ఎక్కువగ దర్శింపగలశక్తి ప్రేమకు ఉన్నది; వీరోచిత ప్రోత్సాహములద్వారా ప్రేమ వానిని స్వకర్తవ్యతానిష్ఠుని చేయును. మనలో ఏమాత్రము గుణమున్నను దానిని పైకితీయుగల సూక్ష్మశక్తికంటె మైత్రికి ప్రధానలక్షణము మరేమికలదు? అటుపిమ్మట ఎప్పుడూ మనము మనలను గూర్చి గాని, జీవితమును గూర్చి గాని తేలిక దృష్టితో ఆలోచింపము. మెడలువంచి, ఏదోఒక ప్రయోజనకరమైనపని మనము సాధించునట్లు మైత్రి మనలను ప్రోత్సహించును. రైలురోడ్డుమీద త్రవ్వకము పనిచేయువారి పరిశ్రమ మననిక సిగ్గుపడునట్లు చేయజాలదు.

ప్రజలలో అన్నివర్గములవారూ సమకాలిక మహా పురుషునిపట్ల చూపు భక్తి ప్రపత్తులు (అవి అత్యంత నిష్కల్మషమైనవని నా తలంపు-) కూడ ఈ శీర్షిక క్రిందికే వచ్చును: కొరియలేనస్ (రోమన్ యోధుడు; క్రీ. పూ. 289) గ్రేకస్ (రోమన్ రాజ్యపాలనా దక్షుడు; క్రీ. పూ. 153-121) లు మొదలుకొని పిట్ (ఆంగ్లరాజ్యపాలనా దక్షుడు; 1759-1806,) లాఫాయెట్ (ఫ్రెంచిసేనాని ; 1757-1834,) వెల్లింగ్టన్ (బ్రిటిష్‌సేనాని; 1769-1852), వెబ్‌స్టర్ (అమెరికా రాజ్యపాలనా దక్షుడు; వక్త; 1787-1852), లామార్టిన్ (ఫ్రెంచికవి; రాజ్యపాలనా దక్షుడు; 1790-1869) ల వరకు అందరిపట్ల అట్టి భక్తిప్రపత్తులు ప్రదర్శితములగుచునే వచ్చినవి. వీథులలో ఆ జయజయ ధ్వానములు వినుడు! ప్రజలు తగినంతగా అతనిని సందర్శింపను గూడ లేరు. ఆ మనిషిని చూచి వారు పొంగిపోవుదురు. అదిగో తల! అదిగో మొండెము! ఓహో ముఖము! ఏమికన్నులు! ఏమి ఆ ఆజానుబాహువులు! నిలువెల్ల వీరరసముట్టిపడు మూర్తి! ఆ మహాయంత్రమును నడుపుటకు అర్హమైనదే ఆ ఆంతరవర్చస్సును! ఈ విధముగా-విడివిడిగ అనుభవించు వేళ సాధారణముగా పైకి ప్రకటింప వీలుపడని వారి ఆనందమునకు అట్టి సందర్భాలలో సంపూర్ణ వ్యక్తీకరణావకాశము లభించును. అందుచేవారి సంరంభము మరింత ఉచ్ఛస్థాయికి లేచును; సాహిత్యక ప్రతిభ గల రచనలను చదువువేళ పాఠకుడు అనుభవించు ఆనందములోని రహస్య

మిందే! ఎట్టి దాపరికము లేని ఆనందప్రకటన మది. ఒక ఖనిజపర్వతము నైన కరిగించి వేయుజాలు నంతటి ఉష్ణత పుట్టును. షేక్స్పియర్ ప్రధాన ఘనత అందరికంటె ఎక్కువగా అతడు ఆంగ్లభాష తత్త్వము నెరిగియుండుట, తాను చెప్పదలచుకొన్నదానిని చెప్పగలిగి యుండుట—అని మనము ప్రకటింపవచ్చును. కాని నిజమునకు నిర్నిరోధముగ పొంగి పొరలు ఆనందమునకు వరదతలుపులు తెరచునేటే అతని రచనలోని ఆరోగ్యవంతమైన, అత్యంత ప్రధానమైన లక్షణము. షేక్స్పియర్ పేరు ఇతర లాభములను, కేవలము మానసికములైన వాటినెన్నిటినో మనకు స్ఫురింపజేయవచ్చును.

సెనేట్ సభలును, సార్వభౌములును బంగారు పతకములు, ఖడ్గములు కానుకలుగా ఈయవచ్చును; కాని మానవుని తెలివి నంగీకరించుచు ఒక ఉన్నతస్థాయినుండి అతనిపై ఉదాత్తమైన ఊహాలను ప్రసరింపజేయుట అను ఉపదతో ఆ కానుకలు సాటిరావు. మొదటిరకపు కానుకలు సాధారణముగ జీవితములో రెండవసారి లభింపవు; మహాప్రతిభ మాత్రము తన కానుకలను నిరంతరాయముగ వర్షించుచునే యుండును. కాని, మానవుడు ఎప్పటికప్పుడు సంతృప్తి చెందుచు, ఏ శతాబ్దమునకో ఒకసారి మాత్రమే ఆ కానుకలను స్వీకరించుచుండును. భావ మూల్య సంసూచకులైన మహాప్రతిభావంతులు రంగముపైకి రాగానే, కేవలము ద్రవ్యజాతము విలువలను సూచించువారి హోదా తగ్గి వంటవారుగాను, మిఠాయి దుకాణ దారులుగాను, వారు దిగనాసిల్లి

పోవుదురు. ఇంద్రియాగమ్య జగత్తులకు సంబంధించిన ప్రకృతి శాస్త్రజ్ఞుడు, భౌగోళికుడు మున్నగువారే నిజమైన ప్రతిభాశాలురు. వారు ఆ జగత్తుల పటములను తయారుచేసి ఇత్తురు. మనకు నూతన కార్యరంగములతో పరిచయము కలిగించుట ద్వారా ప్రాత కార్యరంగములపై మనకు గల మమకారముపై నీళ్ళు చల్లుదురు. వెంటనే ఆ నూతన జగత్తులే వాస్తవములనీ, అంతవరకు మన మెరిగిన ప్రాతజగత్తు ఆభాసయే యనీ మనము గుర్తింతుము.

శరీర సౌందర్యమును, అంగసౌష్ఠవమును సందర్శించుటకై తాలింఖానాలకు, ఈత నేర్పుబడులకు మనము పోవుదుము. మనస్సుతో చేయు వివిధములైన కసరత్తులను దర్శించుట వలన గూడ అట్టి ఆనందమే, అంతకంటె కూడ ఉదాత్తమైన లాభమే మనకు కలుగును. ధారణాశక్తి, గణిత శాస్త్రప్రావీణ్యము, నిర్లిప్తుడుగా ఉండగల అద్భుతశక్తి, భావన సాధించు విపరివర్తనములు, బహుముఖ ప్రజ్ఞాప్రదర్శనము, ఏకాగ్రత మున్నగునవి మనస్సుయొక్క అట్టి సర్కస్ పనులు. అవి శరీరావయవములలో ప్రతిదానికీ పల్టాగా మనస్సుకుగల గుప్తావయవముల నన్నిటిని సువ్యక్తముచేయును. ఆవిధముగా మనము ఒక క్రొత్తరకమైన తాలింఖానాలో ప్రవేశించి, మానవులను వారి అత్యంత యథార్థ లక్షణాలను బట్టి గుర్తించుట నేర్చుకొందుము. ప్లేటోతోపాటు మనము కూడ "కళ్లతో గాని, మరేఇతరేంద్రియముతో గాని ప్రసక్తి లేకుండ సత్యమును, అస్తిత్వమును

దర్శింపగల మహాత్ములను గుర్తింప''జాలుదుము. ఈమానసిక ప్రజ్ఞలన్నిటిలోను అత్యంత ప్రముఖమైనది - భావనాశక్తి ప్రదర్శించు మొగ్గలు,సమ్మోహనాస్త్రప్రయోగము,పునరుజ్జీవనము మున్నగువానితోకూడిన కౌశలము. ఇది మానవునిలో ఉద్బుద్ధమగుచో అతని శక్తి పదింతలుగ, వేయింతలుగ పెరిగిన ట్లనిపించును. అది అపరిమేయ పరిమాణముగల, ఆస్వాద్యతరమైన మరొక యింద్రియమును వికసింపజేసి, సాహసముతో కూడిన ఒక క్రొత్త అలవాటును మనస్సుకు కలిగించును. మనము తుపాకిపోగఅంతటి సంకోచ, వ్యాకోచ స్వభావము గలవారము.ఒక గ్రంథములోని ఒక వాక్యమో, ప్రసంగములో జారవిడిచిన ఒకపదమో మన భావమును విడుదలచేయును; తత్క్షణమే మన శిరస్సులు పాలపుంతలో అభిషేకము పొందును; మన పాదములు అధోలోకపు అడుగు భాగమును మెట్టును. ఈ లాభమే నిజమైనది; ఏలనన - ఇట్టి వ్యాకోచముపొందు హక్కు మనకు గలదు. ఒకసారి మనము గట్లను అధిగమించితిమా - ఇక తిరిగి ఎన్నడూ వెనుకటివలె పండితభిమక్కులము కాబోము.

మానవమేధ యొక్క ఉదాత్తప్రవృత్తులు అన్యోన్య సంబంధము గలవి; అందుచేతనే ఏదో ఒక భావనాశక్తి తరచు శక్తిమంతములైన మేధ లన్నిటిలోను సమానముగ కానవచ్చుచుండును; ప్రథమ శ్రేణికి చెందిన గణితశాస్త్రజ్ఞునిలోకూడ అది కన్పించును; కాని ముఖ్యముగా ధ్యాననిరతులై, అంతర్దృష్టి నభ్యసించువారిలోనే అది ఎక్కు

వగా ఉండును. ఈ వర్గమువారికి ఏకత్వదృష్టి, ప్రతిస్పంద దృష్టి కూడ ఉండుటవలన వారివలననే మన కెక్కువ మేలు జరుగును. ప్లేటో, షేక్స్పియర్, స్వీడెన్‌బర్గ్, గాథేలు కన్నులు ఈ సూత్రములు రెంటిని దర్శించినవి. ఈ సూత్రములను దర్శించుట మనస్సుకు ఒకవిధమైన ఛందస్సు వంటిది. వీటిని దర్శింపలేకపోవుట వలననే అల్పబుద్ధులు అల్పబుద్ధులుగా నున్నవి.

ఇట్టి విందులుకూడ ఒక్కొక్కప్పుడు అతిగా పరిణమించుట గలదు. విజ్ఞానము విషయములో మనము చూపు ఉత్సాహము విజ్ఞానుల విగ్రహారాధనగా విపరిణామ మొందును. ముఖ్యముగా శక్తిమంతమైన విధానములలో ఒక మేధ మానవులకు హితబోధ చేసినపుడు ఇట్టి పతనము ఎక్కువగా వ్యక్తమగును. ఆరిస్టాటిల్ (గ్రీక్ తత్వవేత్త; క్రీ. పూ. 384-322) ఉపదేశాలు, టాలెమీ (ఈజిప్టు ఖగోళ శాస్త్రజ్ఞుడు) ఖగోళ శాస్త్రజ్ఞానము, లూథర్ (జర్మన్ మత సంస్కర్త; 1483-1546), బేకన్ (ఆంగ్లతత్వవేత్త, 1561-1626), లోకే (ఆంగ్లతత్వవేత్త; 1632-1704) ల బోధలు; మతరంగములో సోపానక్రమ మతాచార్యవ్యవస్థ (Hierarchy) చరిత్రయు, ప్రవక్తల యొక్కయు, ఆ ప్రవక్తల పేర్లమీద స్థాపితములగు మతశాఖల యొక్కయు చరిత్రలును ఇట్టివే!. పాపము-ప్రతిమానవుడూ ఆ రీతిగా బలియై పోవుచున్నాడు. మానవుల అశక్తత సదా అధికార దర్పమునకు స్వాగతము పాడుచుండును. అసభ్యశక్తి తన

ప్రేక్షకుని కనులకు మిరుమిట్లు గొలిపి, అంధుని చేయుటలో వినోదించును. కాని, నిజమైన ప్రతిభ తననుండి గూడ మనలను రక్షింపజూచును. నిజమైన ప్రతిభ మనలను దుర్బలులను చేయుటే కాక, మనలను విముక్తులను చేసి, నూతనేంద్రియములు మనలో వికసింపజేయును. ఒక విజ్ఞాని మన గ్రామమునకు వచ్చినచో, ఆయన తనతో ప్రసంగించు వారందరి దృష్టినీ అంతకుముందు వారు గమనించి యుండని ప్రయోజనముల వంకకు త్రిప్పి, వారిలో తాము సంపన్నుల మన్న ఒక నూతన చైతన్యమును కలిగించును; అచంచలమైన సమతా భావము నాయన ప్రతిష్ఠాపించును; ప్రకృతిసిద్ధ నిరోధములను, హామీలను మనము గుర్తించునట్లు చేసి, మన మెన్నడూ వంచితులము కాబోమని నచ్చజెప్పి, ఆయన మనను శాంత పరచును. ధనికులు తమ దోషములను, దారిద్ర్యమును అర్థము చేసికో గలుగుదురు, పేదలు తమ విముక్తి సాధనములను, వాటి ఆకారములను గుర్తింపగలుగుదురు.

కాని, ప్రకృతి ఉచితసమయములోనే ఈ సర్వస్వమును సంఘటింపజేయును. చక్రభ్రమణము ఆమె చికిత్సావిధానము. ప్రతిభాశాలురతో విసుగుపుట్టినప్పుడు మానవాత్మ మార్పును కోరును. ఇల్లాలు తనకు చాల ఉపయోగకరముగా ఉండిన పనిమనిషి విషయమై ''ఆమె యిప్పటికే తగినంత కాలము మాయింట పనిచేసినది; ఇకచాలును'' అనును. మనము కొన్ని స్వభావములవంటివారము; లేక కొన్ని బాహ్యచిహ్నల వంటివారము; మనలో ఎవ్వరమూ పరిపూర్ణులముగాము.

మనము స్పృశించి ముందుకు సాగుదుము; చాల జీవితముల మీాది నురుగును కొంచెముగ చప్పరించి, తరలిపోదుము. చక్రభ్రమణము ప్రకృతిసూత్రము. ప్రకృతి ఒక మహాపురుషుని అస్తమింపజేసినచో, అతనివంటి మరొక మహాపురుషుని ఉదయమునకై ప్రజలు దిగ్వలయము నర్థింతురు; కాని, ఎవడును ఉదయింపడు; ఉదయించు సూచనలుగూడ కానరావు. ఆతనిశ్రేణి అతనితోనే అంతమొందిపోవును. దానికంటె భిన్నమైన మరేదో ఒకరంగములో తరువాతి మహాపురుషుడు ఉద్భవించును. జెఫర్సన్‌గాని, ఫ్రాంక్లిన్‌గాని తిరిగిపుట్టడు. ఈతడవ ఒక గొప్ప విక్రేత జన్మింపవచ్చును. తరువాత ఒక గొప్పరోడ్డు కంట్రాక్టరు రావచ్చును. అటు పిమ్మట ఒక మత్స్యశాస్త్రజ్ఞుడు, అనంతరము ఒక మహిష మృగయా విశారదుడో లేదా ఒక అర్ధఆటవికుడైన'పశ్చిమ' రాష్ట్రసేనానియో అవతరింపవచ్చును. ఈవిధముగా అసభ్య ప్రతిభనుండి మనకు రక్షణ ఉన్నది. ఉదాత్త ప్రతిభవిషయములో ఇంతకంటె సున్నితమైన ప్రతిక్రియగలదు. ఆ ప్రతిభాశాలురు మనకు సంక్రమింపజేయుశక్తి వారి సొంతముకాదు. కొన్నిభావాలు మనను ఉదాత్తులనుచేసినచో ఏ ప్లేటోకో మనము అధమర్ణులముకాము; ప్లేటోనుకూడ అధమర్ణుని జేసికొన్న ఆ భావమునకే మనమును అధమర్ణులము.

ఒకానొకవర్గము మహాపురుషులకు మనము ప్రత్యేకముగా ఋణపడియున్నామని చెప్పుట నేను విస్మరింపరాదు. జీవితము అంశాలలో తారతమ్యముచూపు ఒక నిశ్రేణిక

వంటిది. మన మహాపురుషులలో ఒకశ్రేణికీ, మరొకశ్రేణికీ మధ్య పెద్ద పెద్ద అంతరములుగలవు. అన్నియుగములలోను మానవజాతి కొద్దిమంది మహాపురుషులనే ఆశ్రయించుకొని, బ్రదికినది; ఆమహాపురుషులు తాము ప్రాతినిధ్యమువహించిన భావముయొక్క ఉదాత్తతవలననో, లేక తమ ఆకర్షణశక్తి యొక్క విస్తృతివలననో మానవజాతికి అధినేతలు, శాసన ప్రదాతలుఅగు అర్హతను పొందినవారు. మూలప్రాకృతిక తత్వాలను వారు మనకు బోధింతురు; అనగా - వస్తువుల యథార్థ వ్యవస్థను మనకు పరిచితముచేయుదురు. దినదినము మనము ఎండమావులఅలలపై ఈతలు కొట్టుచున్నాము. గాలిలో నిర్మితములైన ఇళ్ళు, నగరాలు సమర్థముగ మనలను వినోదపరచుచున్నవి; మన చుట్టునున్న జనమును వంచింప జాలుచున్నవి. కాని జీవితము సత్యనిరతమైనది. విస్పష్టమైన సుదీర్ఘ కాలవ్యవధానములలో మనము ఇట్లనుకొనుచుందుము "వాస్తవికాంశములలోనికి నాకు ప్రవేశము కలుగుగాక! ఈ హాస్యగాని టోపీని నేను చాలాకాలముపాటు ధరించి నాను." అప్పుడు మనము మన ఆర్థికరాజనీతి శాస్త్రముల అర్థము తెలిసికొందుము. స్వరము మన చేతికిచ్చినచో, ఆ స్వరములో లోకములోనివ్యక్తులూ,వస్తువులు 'సరిగమ'లుగా చేసి మనము పల్లవిపాడుదుము. హేతువాదము మన నుండి దూరము చేయబడుచున్నది. అయినను సంపన్నసంబద్ధ జీవితాలను గడపిన వివేకులుకూడ కొందరులేకపోలేదు. వారు తెలిసికొన్నదంతయు మనకొరకే తెలిసికొనిరి. ప్రతి నూతన

మేధతోనూ ప్రకృతియొక్క ఒక నూతనరహస్యము వ్యక్త మగుచు వచ్చినది. చిట్టచివరి మహాపురుషుడు ఆవిర్భవించు వరకు బైబిలుగ్రంథము పూర్తికాదు. ఈ మహాపురుషులు మనలోని పశుప్రవృత్తుల సంధిప్రలాపాలను సరిదిద్ది మనలో సామంజస్యముపెంచి, నూతన లక్ష్యాలవంకకూ, నూతన శక్తులవంకకూ మన దృష్టిని త్రిప్పుదురు. మానవులలోని భక్తి, ప్రపత్తులు వీరిని గుర్తించి అత్యున్నతస్థానారూఢులను జేయును. వీరి మహాప్రతిభను జ్ఞప్తికి తెచ్చుచు ప్రతినగరము లోను, గ్రామములోను, గృహములోను, నౌకలోను వెలయు అంసఖ్యాకములైన విగ్రహములు, చిత్రపటములు, స్మారక చిహ్నములు ఇందుకు నిదర్శనములు.

"కనుల తన్మహామూర్తులే కదలు నెపుడు
రక్త సంబంధు, లే కోడరో క్తి విషయు
తార ! శయన భోజన శాలలందు మధుర
దృక్కుల, హిత వాక్కులను దీపించు చుంద్రు."

("Even their Phantoms arise before us,
Our loftier bothers, but one in blood ;
At bed and table they bord us
With Looks of beauty and words of good.")

నూతన భావముల వలన కలుగు విస్పష్టప్రయోజన మును, ప్రజాసామాన్యము మనస్సులలోనికి నైతికసత్యాలను చొప్పించినవారి సేవలను ఉదాహరించుట ఎట్లు ? నా జీవిత మంతటిలో నిరంతరాయముగా ఈ విలువల పట్టికను

తయారుచేయుటలో సతమతమైనాను. నేను నా పెరటి తోటలో శ్రమించుచు యాపిల్ మొక్కలకు సేవచేయుచున్నచో నాకు తనివితీరనంతగా కాలక్షేప మగును. కాని ఒక రోజు గడచిపోయినదనీ, నేను సాధించునది ఈ అమూల్యమైన శూన్యమును మాత్రమే అనీ నా కనిపించును. నేను బాస్టన్ నగరమునకో, న్యూయార్క్ నగరమునకో పోయి, నా పనులమీద ఇటూ, అటూ పరువులు పెట్టుదును; ఆ పనులు అతిశీఘ్రముగానే ముగియును గాని, దినముకూడ అంత శీఘ్రముగానే అంతమగును. ఒక స్వల్ప ప్రయోజనము కొరకు నేను చెల్లించిన మూల్యమును తలచుకొన్నప్పుడు నాకు విచారము కలుగును. నాకు 'ప్యూ డేన్ (Peand'ane) అను ఫ్రెంచికథలోని చెప్పులు జ్ఞప్తికి వచ్చును; వాటిని ఎవరు తొడిగికొన్న, వారి కోరిక సిద్ధించునట! కాని ఒక్కొక్క కోరికతో చర్మములో కొంత ముక్క హరించిపోవును. నేను ఎప్పుడైన జీవకారుణ్యవాదుల (Philanthropists) సభకు పోయినచో, నేనెంతయత్నము చేసిననూ నా దృష్టిని గడియారము పైనుంచి మళ్ళించుకొనలేను. కాని, వ్యక్తులను, పక్షములను, కెరోలినా, క్యూబాలను గూర్చి ఎక్కువ తెలియకపోయినను సమస్యల నన్నిటినీ పరిష్కరించగల సూత్రము ప్రకటించి, తద్ద్వారా ఆ సత్యవర్తనుల ఆట కట్టించగల, స్వార్థపరులను దివాళా తీయించగల ధర్మము నాకు బోధించి, నేను దేశ, కాల, ప్రత్యేక పరిస్థితులకూ, శారీరక దౌర్బల్యాకూ పరతంత్రుడను కాననీ, నన్ను విము

క్తాని చేయు శక్తి మానవత్వమునకు గలదని చెప్పగల ఒక ఉదాత్తవ్యక్తి అక్కడ నాకు తటస్థపడినచో, ఇక నేను గడియారము ప్రసక్తే మరచిపోవుదును. వ్యక్తులతోడి బాధాకర సంబంధములనుండి నేను బయటపడుదును. నా గాయములు మానుపట్టును. కలుషపరుపరాని సామగ్రి నా అధీనతలో ఉన్నదను జ్ఞానమువలన నేను అమరుడ నగుదును. ధనికులకు, పేదలకు మధ్య నిరంతరాయముగ పోటీ జరుగుచున్నది. బజారులో గోధుమ గాని, ఉన్ని గాని, నివేశన స్థలములుగాని పరిమితప్రమాణములోనే ఉన్నవనుకొనుడు. నేను ఎంత భాగము ఎక్కువ వాటిలో వాంఛింతునో ఇతరులకు అంత భాగము వాటిలో తక్కువ అగును. సత్ప్రవర్తన పథము నతిచరింపనిచో నాకు మేలు చేకూరునట్లు లేదు. ఎవ్వడును ఇతరుని ఆనందము చూచి, ఆనందపడడు. మన వ్యవస్థయే యుద్ధోచితమైనది. బాధాకరమైన ఆధిక్యభావముతో కూడినది. శాక్సన్ జాతిలోని ప్రతిబాలుడూ ప్రథమ స్థానము నాశించునట్లు శిక్షితుడగును. అదీ మన వ్యవస్థ తనతో పోటీ చేసి, ఓడిపోయినవాని దుఃఖము, అసూయ, ద్వేషములతో మానవుడు తన గొప్పతనమును కొలుచుకొనును. కాని, ఈ నూతన రంగాలలో తగినంత అవకాశము ఉన్నది. ఇందు ఆత్మస్తుతులకూ, ప్రత్యేక గౌరవాలకూ ఆస్కారము లేదు.

వాస్తవికాంశములకూ, భావములకూ ప్రతినిధులుగా నిలుచు అన్నితరగతుల మహాపురుషులను నేను మెచ్చుకొందును.

మొరటుగాను, సరళముగాను ప్రవర్తించిన "భగవంతుని చేతి న్యాయదండము" లన్నను, "మానవజాతి ప్రియతము" లన్నను కూడ నేనిష్టపడుదును. మొదటి సీజర్, స్పెయిన్ రాజు 5 వ చార్లెస్, స్వీడెన్ రాజు 12 వ చార్లెస్, రిచర్డ్ ప్లాంటాజెనెట్, ఫ్రాన్స్ చక్రవర్తి బోనపార్టీ - అందరూ నాకు ఇష్టులే! తమ పదవులను తగు చాకచక్యముతో నిర్వర్తించు సభ్యులను-కెప్టెనులను, మంత్రులనూ, సెనేటరులనూ - నేను ప్రశంసింతును. ఇనుపపాదములమీద దృఢముగా నిలబడి, ఆభిజాత్యము, ఐశ్వర్యము, రూపసంపద, వాగ్ధాటి, అనుకూల పరిస్థితులు కలిగి, ప్రజలనందరినీ ఆకర్షించి తన సామంతులుగను, సమర్థకులుగను చేసికోగల యజమానుడన్న నాకిష్టము. కత్తీ, కర్రా-లేక కత్తివంటి, కర్రవంటి శక్తులు - ఈలోక వ్యవహారములను నిర్వర్తించుచున్నవి. కాని, అతడు తన యోధులతో సహా తానువై తొలగి, వ్యక్తినిరపేక్షమైన కేవలహేతువాదమునూ, సూక్ష్మమూ అప్రతిహతోర్ధ్వగతి సహాయకమూ అగు శక్తిని మన భావములలోనికి ప్రవేశపెట్టి మనలోని వైయక్తికదృష్టిని అంతమొందించగలిగినచో అతడింకనూ గొప్పవాడని నేనందును. ఆ హేతువాదశక్తిముందు రాజదండాధికారము అత్యల్పము. అప్పుడు ఆ మహాపురుషుడే ప్రజలకు ఒక సువ్యవస్థ నీయగల రాజుఅగును. సర్వప్రాణి సమానత్వమును బోధించి, తన సేవకులను అనాగరక దాస్య భావమునుండి విముక్తులనుచేసిన ప్రభువగును. తన సామ్రాజ్యమునే త్యాగముచేయగల చక్రవర్తి యగును.

కాని, నేను రెండు, మూడు విధములైన సేవాస్వరూపములను గూర్చి మరికొంచెము వివరణముతో ప్రత్యేకముగా చెప్పదలచినాను. ప్రకృతి నల్లమందుపై గాని, ఘటపర్ణి (Nepenthe : బాధను మరపించు మాదకశక్తిగల ఒక ఈజిప్షన్ ఓషధి)పై గాని ఎప్పుడూ జాలి వహింపదు; కాని, తన సృష్టిలోని ఒకభాగమందు ఒకవక్రతను, లేకలోపమును సంఘటిల్ల జేసినచో ఆ వినాశముపై ఆకర్షకములైన పూలతో కూడిన గంజాయి (Poppies) మొక్కలను సృష్టించి ప్రకృతి ఆలోపమును పూరించుచుండును. అందుచే అట్లు బాధితుడైన ప్రాణి అనుదినము తనకు జరిగిన వినాశమువంక లోకము వేలెత్తి చూపుచున్నను, దానిని గుర్తింపక, గుర్తింపశక్తిలేని వాడై, ఆనందముతోనే తన మనుగడను వెళ్ళబుచ్చుచుండును. సంఘమునకు చీడపురుగులవలె కల్పించు నిరర్థక, అపచారక జీవు లందరూ తమను సంఘము సరిగా వినియోగించుకొనుట లేదనియే భావించుచుందురు; తమ సమకాలికుల కృతఘ్నతను, స్వార్థపరతను జూచినప్పుడు వారిలో కలుగు ఆశ్చర్యమునుండి వారు బయటపడలేరు. మన భూగోళముపై గుప్తసుగుణములు వీరులలోను, దేవతామూర్తుల లోను మాత్రమే కాదు; వ్యర్థాలాప ప్రియుల (Gossips) లోను, నర్సులలోను కూడ అవి ఆవిష్కృతము లగును. ప్రతిప్రాణిలోను తగినంత స్తబ్ధత (inertia) ను, మేల్కొలుపు లన్నను, మార్పు లన్నను కోపగించుకొను గుణమును కల్పించిన ఏర్పాటు విచిత్రమైనదికాదా? ప్రతి

వ్యక్తిలోను జ్ఞానశక్తికి పరతంత్రముకాని అభిప్రాయదర్పము, అనగా–తన అభిప్రాయమే సరియైనదను నిశ్చయము–ఒకటి ఉన్నది. జవసత్త్వములు ఉడిగిపోయిన ముసలిఅవ్వ, చెట్లు నరకుట తప్ప వేరెరుగని మూర్ఖుడు కూడ తమలోమిగిలిఉన్న లేశమాత్రపు దర్శనశక్తి సహాయముతో తమ అభిప్రాయాలకు తామే మురియుచు, ఇతర లోకములోని అసందర్భాలను జూచి ముసిముసి నవ్వులు నవ్వుకొనుచుందురు గదా! తమ కంటె భిన్నముగా ఉండుటే అసందర్భాలకు కొలబద్ద. ఒక్కనికీ తనదే అపమార్గమేమో అను అనుమానముండదు. అత్యంత శక్తిమంతమైన టంకమగు ఈ దాహక ఖనిజము (bitwmen) తో వస్తువుల నన్నిటినీ సంఘటిత పరచి యుంచు ఈ ఊహ ఉజ్జ్వలమైనది కాదా? కాని, ఈ ఆత్మాభినందన రూపమగు ఈ ముసిముసి నగవు మధ్య 'థర్‌సైటీజ్' (ట్రాయ్ పట్టణ పతనమునకు పూర్వమున్న అనాగరక, కురూపి గ్రీకులు) కూడ ప్రేమించి, అభినందింపగల ఒక వ్యక్తి అవతరించును. ఆ వ్యక్తియే మన త్రోవను నిర్దేశించి, మనకు మార్గదర్శకుడు కాగలవాడు. అతడు మనకు చేయు సహాయమునకు అంతులేదు. ప్లేటో జన్మించి యుండనిచో, హేతుబద్ధమైన గ్రంథముల రచన సంభావ్యమను విషయములో మనకు ఇంచుమించు విశ్వాసము నశించిపోయి ఉండెడిది. మన కేప్పుడును ఏదో ఒక కొరత ఉన్నట్లు కనిపించును, కాని, ఆ కొరత ఎప్పుడూ కొరతగానే ఉండును. మన గ్రహణశక్తి నిరవధిక మగుటచే మనము వీరపురుషుల

తోడి సంపర్కము నెక్కువగా అభిలషింతుము. మహాపురుషుల సాంగత్యము వలన సులభముగా మన ఊహాలు, మన ప్రవర్తనా రీతులు ఉదాత్తములగును. నిజముగా వివేకశక్తి కలవారు అరుదైన కావచ్చును గానీ, మనఅందరిలోను వివేకవంతుల మగుటకు కావలసిన సామర్థ్య మున్నది. ఒక సంఘములో ఒక్క వివేకవంతు డున్న చాలును; అందరూ వివేకవంతు లగుదురు; అది అంత శీఘ్రసాంక్రామికము.

ఈవిధముగా మహాపురుషులు మనకన్నులనుండి అహంకార దోషమును తొలగించి, ఇతరులనూ, వారు సాధించిన పనులనూ చూడగల శక్తిని కలిగించు నేత్రౌషధముల వంటివారు. కాని మొత్తము జనాభాకంతకూ చెందునట్టియు ఒక్కొక్క యుగమున కంతకూ సంబంధించినట్టియు అవలక్షణములూ, అపరాధములూకూడ ఉండును. మానవులు తమ వెనుక తరముల వారికంటె తమ సమకాలికులనే ఎక్కువగా పోలియుందురు. వృద్ధదంపతుల లోను, లేక ఒకేయింటిలో ఏళ్ళతరబడి కలసి జీవించు వారిలోను సాదృశ్యమేర్పడుట మనము గమనింతుము; అట్టివారు తగినంత దీర్ఘకాలము జీవించుచో వారిని విడివిడిగ గుర్తుపట్టుటకూడ అసంభవమగు నంతటి పోలిక వారి మధ్య ఏర్పడును. ప్రపంచము నంతటిని కరిగించి ఒకే ముద్దగా చేతుమని బెదరించు ఇట్టి ఇచ్ఛకములను ప్రకృతి అసహ్యించుకొనును; అందుకే వెంటనే ఈ ఏకీకరణోన్మాదచర్యను భగించుటకు తత్తరపడును. ఇట్టి ఏకీకరణప్రక్రియయే ఒక

పట్టణమునకు, ఒక తెగకు, లేక ఒక రాజకీయపక్షమునకు చెందిన వ్యక్తుల మధ్యకూడ సాగుచుండును; ఆ యా యుగములకు సంబంధించిన ప్రముఖభావములు గాలిలో తేలియాడుచు, ఆగాలి పీల్చినవారికెల్ల అవి సంక్రమించుచుండును. కొంచెము ఉన్నతమైన స్థాయినుండి చూచినచో ఈ న్యూయార్కునగరము, ఆ లండన్‌నగరము, ఈ పాశ్చాత్య నాగరకత, ఈ సర్వము మనోవక్రతలకు నిలయముగా కనిపించును. మనము పరస్పరము అభినయించుకొనుచు మన పోటీపోటీలతో 'కాలము' యొక్క ఉన్మాదమును ఉపశమింప చేయుచుందుము. అంతరాత్మ మందలింపులనుండి తప్పించుకొనుటకు మన సమకాలికులందరు ఇట్లే ప్రవర్తించుచున్నారని సమాధానము చెప్పకొందుము. మనతోటివారంతటి మంచిగాను, తెలివిగాను ఉండుట చాల తేలిక! మన సమకాలికులు అప్రయత్నసిద్ధముగ, ఇంచుముంచు తమ చర్మరంధ్రములనుండి అవలీలగా గ్రహించిన అంశములనే వారినుండి మనము నేర్చుకొందుము. దానినిమనము సహానుభూతి ద్వారా గ్రహింతుము; లేక భార్య తన భర్తయొక్క వైజ్ఞానిక, నైతిక స్థాయుల నందుకొన్నట్లు దానిని నేర్చుకొందుము. కాని, వారు ఎక్కడ నిలచిపోదురో, మనమూ అక్కడనే నిలచిపోదుము. మరొకఅడుగు ముందుకు వేయుటకు చాల శ్రమపడవలెను. మహాపురుషులు, - అనగా ప్రకృతి నధీనము చేసికొని, తాత్కాలికములైన 'ఫాషన్'ల నధిగమింపగలవారు-విశ్వజనీన భావములపై తమకుగల విశ్వాసము

ద్వారా ఈ సామూహికదోషముల బారినిపడకుండ మనలను కాపాడుచు, మన సమకాలికులనుండి మనలను రక్షింతురు. అందరూ ఒకేఅచ్చులో పోతపోసినట్లు తయారగుచున్న కాలమున అపవాదరూపములగు అట్టివ్యక్తుల ఆవిర్భావమును మనము వాంఛింతుము. రహస్య మాం త్రిక వాదము (Cabalism) నకు విజాతీయ మహత్త్వమే సరియైన విరుగుడు.

ఈవిధముగా ప్రతిభాశాలుర వలన మనము పోషింపబడుచు మనతోడివారితో మరీ కలసిమెలసి తిరుగుటవలన కలుగు కాలుష్యమును పోగొట్టుకొందుము; ప్రకృతిప్రగాఢతను అవగతము చేసికొని, వారు మనను ఏదిశలో నడపిన ఆ దిశలో ఔన్నత్యమును సాధింతుము. అసంఖ్యాకులైన అంగుష్ఠమాత్రులకు ఒక్కమహాపురుషుడు పూచీ వహించుచున్నాడు. ప్రతీతల్లీ తనబిడ్డలలో మిగిలినవారందరూ ఒక మోస్తరువారైననూ, ఒక్కకొడుకైనా మహాప్రతిభాశాలి కావలెనని కోరును. అయితే-మహాపురుషుని స్వభావము శ్రుతిమించినచో ఒక క్రొత్తప్రమాదము తటస్థించును. అతని ఆకర్షణాశక్తి మనలను స్వస్థానచ్యుతులను జేయును. మనము దాస్యభావన కలవాటుపడి, వైజ్ఞానికముగ ఆత్మహత్య చేసికొనుచున్నాము. దూరమున దిక్చక్రము వద్ద మనకు సహాయము కన్పించును. ఇతర మహాపురుషులు నూతన గుణాలతో, విరుద్ధమూల్యములతో అన్యోన్య నిరోధకులగుచు దర్శనమిత్తురు. ప్రతివాని ప్రత్యేక మహత్త్వమనెడి తేనియను మూచూచి మూచూచి, మనకు మొగము మొత్తి

పోవును. ప్రతిపేరుకూడా చివరకు విసుగుపుట్టించును. వోల్టేర్ (1694-1778,-ఫ్రెంచ్ తత్త్వవేత్త; రచయిత) హృదయము మంచిదిగాదని అనలేముగదా! అయిననూ-ఆయన సత్పురుషుడైన ఏసు విషయములో భగవంతునితో "నేను నిన్ను ప్రార్థించుచున్నాను. ఆ వ్యక్తిపేరు ఇక నెన్నడూ చెవులబడకుండ అనుగ్రహింపుము." అని ప్రార్థించెను. జార్జి వాషింగ్టన్ సుగుణములనుగూర్చి బ్రహ్మాండముగా చెప్పుదురు. కాని, పాపము! జాకోబిన్ ఉపన్యాస సారాంశము ఏమనగా - "జార్జివాషింగ్టన్ పరమదుర్మార్గుడు" అని. కాని, అదే మానవజాతి యొక్క అప్రతిహతమైన రక్షణ. కేంద్రాభిసారి శక్తి కేంద్రాపసారిశక్తిని పెంపొందించును. మనమొక మనిషిని అతనికంటె విరుద్ధ లక్షణాలుగలవానితో పోల్చి, ఇరువురిమధ్య సామ్యముసాధింతుము; ఒక రాజ్యసౌష్ఠవము క్రిందికి పైకి ఊగులాడు 'సీ - సా' (See-saw) ఆటమీదనే ఆధారపడియుండును.

ఎన్ని చెప్పినను-మహాపురుషుల వలనిప్రయోజనములకు అతిశీఘ్రకాలములో అవధు లేర్పడిపోవును. ప్రతి ప్రతిభావంతుడూ అందరును తనను సమీపింపకుండ 'అలభ్యత'ను కవచముగా ధరించును. దూరమునుండి వారు అత్యంతాకర్షకముగాను, మనకు మిక్కిలి ఆత్మీయులుగాను కన్పింతురు. కాని, అన్నివైపుల మనము వారిని సమీపించుటకు నిరోధములు కల్పింపబడును. మనము వారికి చేరువగ వెళ్ళినకొలదీ వారనిన మనకు ఎక్కువగా మొగము మొత్తిపోవును. వారు

మనకు చేకూర్చిన శ్రేయస్సులో ఏదోకొంత భాగము సార వంతమైనది కానట్లు తోచును. ఏ ఆవిష్కర్త (discoverer) అయినను అత్యుత్తమావిష్కరణమును తనకొరకే చేసికొనును. అతనితోడివారికి - తాము కూడ దానిని స్పష్టముగ దర్శించువరకు - దానిలో ఏదో అవాస్తవికత స్ఫురించును. భగవంతుడు ప్రతిఆత్మకు అనన్యసంక్రామ్యము లగు కొన్ని గుణములతోను, కొన్ని శక్తులలోనుకూడిన దుస్తులు తొడిగి ప్రకృతిలోకి పంపినట్లును, అట్లు జీవకోటి మధ్య ఒక ఆవృత్తి తిరిగివచ్చుటకు పంపుసందర్భమున ఆత్మలుదాల్చిన ఆ దుస్తులపై "అన్యసంక్రామ్యములు గావు" (Not transferable), "ఈ ఒక్క ఆవృత్తికే చెల్లును." (Good for this trip only)అని వ్రాసినట్లును అనిపించును. మానవ మేధల అన్యోన్యసంసర్గము కొంతవరకు మాయతో కూడినది. వాటి సరిహద్దులు కన్పింపవు; అయినను వాటి నెన్నడూ దాటినట్లునూ తోచదు. మనము ఇతరులపట్ల ప్రదర్శింపదగినదీ, ఇతరులనుండి మనము స్వీకరింపదగినదీ అగు సుహృద్భావము ఎంతో. వ్యక్తమై, మనలో ప్రతివాడూ మరొకడుగా మారిపోవుదు మేమో అను ఆందోళనను కూడ కలిగించును. కాని, వ్యక్తి ప్రాధాన్యసూత్రము రహస్యముగ బలపడుచునేయుండును. నీవు నీవే! నేను నేనే! ఎప్పటికిని మనమిట్లే నిలచియుందుము.

ప్రకృతి ప్రతి వస్తువూ యథాతథముగా ఉండిపోవలె ననియే కోరును; ప్రతివ్యక్తీ పెరిగి వేరు కావలెననీ, వేరై

విశ్వప్రపంచముల వరకూ పెరిగిపోవలెననీ, తద్ద్వారా ఇతర ప్రాణికోటిఅంతటిమీద తన శాసనము వర్తింప జేయవలెననీ ఒక వంక యత్నించుచుండ, మరొక వంక ప్రకృతి ప్రతి వస్తువునూ ప్రతి ఇతర వస్తువునుండి రక్షింప జూచుచుండును. ప్రతి వస్తువునకూ ఆత్మరక్షణ గలదు. వ్యక్తులనుండీ వ్యక్తులను రక్షించుశక్తి అత్యంత విస్పష్టముగా కనిపించును. ఈ లోకములో ప్రతి ఉపకారీ తన ఉద్యమము అనావశ్యక రంగముల లోనికి విస్తరింపజేయుట ద్వారా అతిసులభముగా అపకారిగా మారిపోవును; పిల్లలు మూర్ఖులైన తమ తల్లిదండ్రుల దయాధర్మముల మీదఆధారపడు దశకు వత్తురు; ఇంచుమించు అందరు మనుష్యులూ 'అమిత' సాంఘిక ప్రవృత్తి కలిగి అనావశ్యక విషయాలలో జోక్యము కలిగించుకొనుచుందురు. పిల్లల 'సంరక్షక దేవత' లను గూర్చిన మన భావనలు సరియైనవే! దుర్మార్గుల సంసర్గము, అసభ్యత, పశ్చాత్తాపము మున్నగు వాటినుండి తమను తాము కాపాడుకొనుటలో పిల్లలు ఎంత అధికులు! వారు తాము చూచు సర్వవస్తువుల మీదను తమ నిరవధిక సౌందర్యమును ప్రసరింపజేయుదురు. అందుచేత వయోఽధికులమైన మనవంటి దుర్బల విద్యావేత్తల దయాదాక్షిణ్యముల మీద వారు ఆధారపడి లేరు. మనము వారిని తిట్టి, కొట్టి హింసించినచో అనతికాలములో వారు దానిని లక్ష్యపెట్టకుండుట నేర్చుకొని, తమమీదనే తాము ఆధారపడుట నలవరచుకొందురు.

మనము వారిని అపమార్గములలో పెట్టజూచినచో, వారు సదసత్పరిమితులను అన్యత్ర నేర్చుకొందురు.

మహాపురుషుల ప్రభావము మితిమీరు విషయమై మనము భయపడనక్కరలేదు. వారిని మనము మరింత ఎక్కువగా విశ్వసింపవచ్చును. వారిని సేవింపుడు! ఒక పని నీచమను భావమును పెట్టుకొనకుడు! మీరు చేయగలిగిన ఏపని చేయుటకైనను వెనుకాడకుడు. ఆ మహాపురుషుల శరీరములోని ఒకఅవయవముగా, ఆస్యములోని ఒకశ్వాస ముగా పరిణమింప ప్రయత్నింపుడు. మీ అహంభావమును కొంత వదలుకొన సిద్ధపడుడు. మీరు ఇప్పటికంటె విస్తృత మైన,ఉదాత్తమైన ఫలితములను సాధింపనున్నప్పుడు ఈ పను లను చేయుటకు మీరేల సంశయింపవలెను? బాస్వెల్ (జాన్‌సన్ జీవిత చరిత్ర రచయిత; 1740–1795) వలె మరొకనికి నీడగా సంచరించు చున్నాడను పరిహాసములను లక్ష్యపెట్టవద్దు. తన పరిసరములను మాత్రమే తాను రక్షించుకొను 'గర్వము' కంటె సేవాభావము అధిక శక్తి మంతమైనది. నీవు మరొకడవుగా అగుము. నీవు నీవుగా ఉండవలదు; ప్లేటోనిస్టు (ప్లేటోవాద విశ్వాసి) వు కమ్ము; కేవల మొక వ్యక్తిగా నుండకుము. క్రైస్తవుడవు కమ్ము; ప్రకృతిసిద్ధాంత వాదిగా ఉండిపోకుము, కార్టీజియన్ (ఫ్రెంచ్ తత్వవేత్త రెనీడ కార్టీస్ బోధించిన సిద్ధాంతములను విశ్వ సించువాడు) వి కమ్ము; కేవలము కవివైన చాలదు, షేక్స్ పియర్ అనుయాయివి కమ్ము. వ్యర్థయత్నములు చేయ

కము-ప్రవృత్తిరసచక్రము లెన్నటికిని ఆగవు; స్తబ్ధత, భయము, చివరకు ప్రేమ అను శక్తులు కూడ నిన్ను నీ యథాస్థితిలో నిలిపి యుంచలేవు. నిరంతరము పైకి, పైకి సాగిపోవుచుండ వలసినదే! మురికినీటిలో సంచరించుచుండు కలుషపదార్థములో దుర్భిణీయంత్రసహాయమున ఒక సూక్ష్మక్రిమి (Monad) ని, లేక చక్రకీటకము (Wheel insect) ను పరిశీలింపవచ్చును. ఉన్నట్లుండి దానిమీద ఒక చుక్క కన్పించును, అంతలో ఒక పెద్ద మచ్చగా అభివృద్ధిచెంది, అది రెండు సమగ్రప్రాణులుగా విడిపోవును. నిరంతరాయముగ నాగు ఈ విధమైన విశ్లేషణము భావములలోను, సమాజములోను కూడ వ్యక్తమగును. పిల్లలు తమ తల్లిదండ్రులు లేనిచో తాము బ్రదుకలేమను కొందురు. కాని, వారు సరిగా గుర్తించక పూర్వమే ఒక నల్లచుక్క ఏర్పడి, విశ్లేషణము జరిగిపోవును. ఏ హఠాత్ సంభవము కూడ వారికి వారి స్వతంత్రశక్తిని వ్యక్తము చేయదు.

కాని, 'మహాపురుషులు' అను మాట ఒడలు జలదరింప జేయునది. కులభేదము నిజముగ నున్నదా? దుర్విధివిలసనము నిజమా? సత్యము జయించు నను మాట ఏమగుచున్నది? భావుకుడైన యువకుడు ప్రకృతియొక్క బహుభర్తృగమనమునకు ఖిన్నుడగుచుండును. అతడు ప్రకృతినుద్దేశించి ఇట్లనును "నీవు సృష్టించు నాయకుడు ఉదారుడు, సుందరుడు-నిజమే! కాని, ఆ దురదృష్టవంతుడగు ఐరిష్ వాని వంక చూడుము! ఆ దేశమంతయు ధాన్యశకటములతో

కలకల లాడుచుండును. అయినను ఆ ఐరిష్ జాతి అవస్థ చూడుము.'' చరిత్ర ఆరంభకాలము నుండి అచ్చటి ప్రజా సామాన్యము ఆయుధములకు, తుపాకిమందునకు ఏల బలి యగుచున్నారు? అభిమానము, అభిప్రాయములు, ప్రేమ, ఆత్మపరత (self-devotion) కల కొద్దిమంది నాయకులకు అందువలన హోదా పెరుగవచ్చును. వారు యుద్ధమును, మృత్యువును పవిత్రములుగా మార్చివేయుదురు. కాని, వారు కూలికి మాట్లాడుకొని, మృత్యువువాత బ్రోయుచున్న దౌర్భాగ్యుల కందువలన నేమి యొదుగును? మానవ జీవితము చౌకయై పోవుటే దైనికజీవితములో అత్యంత విషాద సంఘటన. మన నికృష్టస్థితి ఎంత అవాంఛనీయమో ఇతరుల నికృష్టస్థితి కూడ అంతటి అనర్థదాయకము. ఏలనన–మనకు సంఘము అత్యంతావశ్యకము.

సమాజము పెస్టలాజియన్ * విధానముపై నడచు ఒక పాఠశాల వంటిదని చెప్పుట ఈ ప్రశ్నకు సరియైన సమాధానము కాగలదా? మరి అందరునూ వంతులవరుసను ఉపాధ్యాయులు, విద్యార్థులు కూడ అగుదురా? ఆదాన, ప్రదానముల రెంటి వలనను మనకు సరియైన మేలు చేకూరును. ఒకేవిషయము నెరిగిన వ్యక్తులు అన్యోన్యము ఎంతో కాలము ఉత్తమ సహచరులుగా మెలగలేరు. కాని, ప్రతి

---

* స్విట్జర్లండ్ సంస్కర్త, విద్యావేత్త జాన్ హెన్రిక్ పెస్టాలజీ (1746–1827) స్థాపించిన విద్యావిధానము. అన్వేషణ ప్రాతిపదికపై వెలసిన విద్యావిధాన మది.

వ్యక్తికీ భిన్నమైన అనుభవము గల తెలివైన మరొక సహచరుని సమకూర్చినచో ఒక సరస్సునుండి పల్లప్రాంతమునకు నీటిని విడచినట్లు విజ్ఞానము ప్రసరించును. అది ఒక నామమాత్ర ప్రయోజనముగా పైకి కనుపింపవచ్చును; కాని, అది ప్రతివ్యక్తికీ అద్భుత లాభము కలిగించును. ఏలనన-అప్పుడు ప్రతివ్యక్తి తన మనస్సులోని భావాలను తాను విస్పష్టముగా చిత్రించుకొనగలుగును. మన వ్యక్తిగతానుభవములలో నిత్యము పరమస్వతంత్రత నుండి పారతంత్ర్యము వరకు గల వివిధ అవస్థల మధ్య అతివేగముగ మనము భ్రమించుచుందుము. ఒకవేళ ఎవరైన సదా సేవచేయు ప్రవృత్తినే గాని, ఉన్నతాసనాధిరోహము చేయు ఆస్థను ప్రదర్శింపనిచో సర్వవిధభావములు ఆవృత్తి పూర్తిచేసికొనుటకు వీలైనంత దీర్ఘకాలము-అతనిని మనము పరిశీలింపలేదన్న మాట! మనము ప్రజాసామాన్యము అని వ్యవహరించుచుందుము గాని, నిజముగా ప్రజాసామాన్యమని చెప్పదగిన వారెవ్వరును లేరు. అందరు మనుష్యులూ ఒకే పరిమాణము గలవారు. ప్రతికౌశలము ఎక్కడనో ఒక చోట దివ్యత్వ మాపాదింపబడి ఆరాధింపబడునను. నమ్మకము ఉన్ననేగాని నిజమైన కళ సంపాద్యముకాదు. బాహాటముగా అందరును పాల్గొనదగిన ధర్మబద్ధమైన పోటీలో బహుమతులు గెలుచుకోగల సమర్థులకు అవి తప్పక యొసగబడును. స్వర్గము కూడ అందరికీ సమానావకాశాలనే కల్పించుచున్నది. ప్రతివ్యక్తియు భూగోళాంతర్భాగములోనికి తన

ప్రత్యేక కిరణమును గూడ ప్రసరింపజేసి, తన కౌశలము కూడ పరాకాష్ఠ పొందుటను దర్శించువరకు అవిశ్రాంతులు గానే ఉందురు.

సాపేక్షముగా తాత్కాలిక మహాపురుషులు గొప వారు; వారి పెరుగుదల వేగము అధికముగా ఉండును. లేక, వారి విజయక్షణములో వారిలో ఆకాలమున ప్రార్థ్యమాన మగు ఒక గుణము పరిపాకమును పొందియుండును. ఇతర కాలములు ఇతరగుణములను కోరవచ్చును. కొన్ని కిరణ ములు సామాన్య అపేక్షకుని దృష్టినుండి తప్పించుకొనును. వాటిని చూచుటకు సునిశితమైన, సుశిక్షితమైన కన్ను కావ లెను. ఒక మహాపురుషుని- అతనికంటె మహాపురుషు లా నాడు లేరాయని మనము ప్రశింపవచ్చును. అతని సమకాలికు లందరును అతనికంటె గొప్పవారే! ఏ అంశములోను అతని కంటె తక్కువకాకపోగా, నిస్సంశయముగా అధికులు. సమాజము వారి మహాత్మ్యాతిశయమును దర్శింపలేనంతటి గొప్పవారు. ఇతరాత్మల రహస్యమును బోధింపకుండ ప్రకృతి ఎన్నడును ఒక మహాపురుషుని ఈ భూగోళము పైకి పంపదు.

ఈ చర్చవలన మనకు ఒక సంతృప్తికరమైన విష యము తేలినది. అది- ప్రేమలో నిజమైన అభ్యుత్థానము ఉన్నదని. 19 వ శతాబ్దినాటి ప్రతిష్ఠలు ఆ శతాబ్ది అనాగర కతను ఋజువుచేయుటకు ఉదాహరణలుగా ఒకనాడు

చేకూర్చబడగలవు. మానవుని ప్రతిభయే చరిత్రకు విషయము; ఆ ప్రతిభయొక్క పరిణామవృత్తాంతమే అందు అభివర్ణిత మగును. ఆ అభివర్ణనములో ఎన్నో అఖాతములను మన ఊహచే పూరింపవలసి యుండును. విశ్వచరిత్ర స్థూల బాహ్య లక్షణములను ఆధారముగ చేసికొని వ్రాయబడినది; మానవునకు తగినంత ధారణాశక్తి గలదు. విఖ్యాతమహా పురుషుల పరంపరలో ఎవ్వడును తానే మనమన్వేషించు హేతుబద్ధతగా, ప్రకాశముగా, సారభూతపదార్థముగా రూపొందినవాడు లేడు. కేవలము కొంతవరకు నూతన సంభావ్యములను ప్రకటించుట మాత్రమే వారుచేసిన పని. ఈ కతిపయోజ్జ్వల బిందువులతో ఆరంభమైన ఈ మహా చిత్రమును ఏనాటికైన మనము పూర్తిచేయగలుగుదుమా? విడివ్యక్తులను అనేకులను గూర్చి చేయు పరిశోధన-వ్యక్తికి ప్రత్యేకాస్తిత్వము నశించి, సర్వులు సంపూర్ణులుగా ఉండు ప్రాతిపదిక స్థితికి మనలను తీసికొనిపోవును. భావము, అనుభవము అనునవి ఆ స్థితిలో లయము చెందును; ఏ వ్యక్తిత్వ (Personality) రూపమగు కంచెయు వాటికి ప్రత్యేక పరిమితుల నేర్పరుప జాలదు. ఇదే మహాపురుషుల శక్తిలోని మూలరహస్యము; వారి ఆత్మలు అంతరశక్తినే నలుదెసల ప్రసరింపజేయును. ఒకనూతన గుణముగల మేధ కేంద్రము నుండి బయలుదేరి, ఏకకేంద్రవృత్తాకార మార్గములలో దివారాత్రములు ప్రయాణించుచు, పూర్వవిధానములద్వారా తనను తాను వ్యక్తమొనర్చుకొనును. అన్నిమేధల మధ్యను

సన్నిహితమైన ధర్మసామ్య మున్నది. ఒకమేధలో ప్రవేశము పొందిన విషయమును ఇతర మేధలో ప్రవేశింపకుండ ఎవరును నిరోధింప జాలరు. సత్యముగాని, శక్తిగాని ఏకొంచెము ఏప్రాంతములో సంపాదితమైనను, అది ఆత్మల సమశ్రేయోరాజ్యమున కంతటికిని గొప్పమేలు చేకూర్చును. కౌశలములోను, స్థాయిలోను అసమానత్వములు అంతర్హితములై, వ్యక్తులందరు తాముతాము పూర్తి చేసికోవలసిన కాలావధులను పూర్తి చేసికొన్న పిమ్మట మనము ఆ వ్యక్తులందరిలోనుగల ఏకత్వమును గ్రహింతుము. వెంటనే బాహ్యముగ కన్పించు అన్యాయములన్నియు అంతరించిపోవును. క్రమబద్ధములనొనర్చి, కార్యప్రవృత్తులనుజేయు ఒకే ద్రవ్యముచే మనమందరమూ నిర్మితులమైనట్లు మన కవగతమగును.

మానవజాతి ప్రతిభయే చరిత్రకారులు స్వీకరింపదగు సక్రమమైన దృక్పథము. గుణములు సర్వదా నిలచియుండును; వాటినివ్యక్తీకరించు మనుష్యులలో ఒకప్పుడవి ఎక్కువగాను, మరొకప్పుడు తక్కువగాను ప్రకటితములగును. ఆ వ్యక్తులు నశింతురు; కాని, ఆ గుణములు నశింపవు. మరొకరి కనుబొమలపై అవి నిలచియేయుండును. వాటిఅనుభవము మనకు అత్యంతము పరిచితమైనదే! *ఫెనిక్సు (Phoenixes) పక్షులను

* 500 ఏళ్ళు ఏకాంతముగ మరుభూములలో జీవించుపక్షి. మరణానంతరము చితిలో దగ్ధమై, ఆ చితాభస్మము నుండి పైకిలేచునని చెప్పుదురు. అమరత్వమునకు దీనిని చిహ్నముగా భావింతురు.

ఒకప్పుడు మనము చూచితిమి. అవి ఇప్పుడంతరించినవి. అయినను, లోకమును భ్రమింపజేయు మాయాశక్తి దాని వలన తరిగిపోలేదు. ప్రవిత్రచిహ్నములు ముద్రితములై, ఒకప్పుడు మన గౌరవమునకు పాత్రములైన ప్రాచీనపాత్రలు కేవలము కుండపెంకులుగా కొంతకాలమునకు మారిపోవును. కాని, ఆ చిహ్నములనుగూర్చిన భావము పవిత్రమైనదే! లోక కుడ్యములమీాదికి పరివర్తితములైన ఆ చిహ్నములను నేటికిని మనము దర్శింపవచ్చును. అభ్యుదయమార్గమందలి మైలురాళ్ళవలె కొంతకాలముపాటు మన బోధకులు సహకారులుగా ఉందురు. ఒకప్పుడు వారు విజ్ఞానాధిదేవతలు; వారి మూర్తులు ఆకాశమంటు ప్రమాణముగలవి. అప్పుడు మనము వారిదగ్గరకు వెళ్ళితిమి; వారి సాధనములను, సంస్కృతిని, పరిమితులను గుర్తించితిమి. తరువాత వారు వైదొలగి ఇతర ప్రతిభావంతులకు తమ స్థానములను అప్పజెప్పిరి. కొద్దిమంది మహాపురుషుల విషయములో - దగ్గరగావెళ్ళివానిని చదువుటకు వీలు లేనంతటిఔన్నత్యమూ, కాలముగాని, తారతమ్య వివేచనముగాని ఒక్క కిరణలేశమునుగూడ హరింపజాలనంతటి ఉజ్జ్వలదీప్తి-ఉన్నచో సంతోషమే! కాని, క్రమముగ మానవులలో పరిపూర్ణతకొరకు అన్వేషించుట మనము మానివేయుదుము. సంఘములో వారు ఏ గుణములకు ప్రాతినిధ్యము వహించుచున్నారో వాటినిచూచి సంతృప్తిపడుట నేర్చుకొందుము. వ్యక్తిపట్ల గౌరవప్రపత్తులు ప్రదర్శించు సర్వమున్న వ్యక్తి

వలెనే తాత్కాలికము; పరిణామాత్మకము. వ్యక్తి తన పరిమితస్థితి నుండి విశ్వజనీనస్థితిని సాధించుటకై పైకి పైకి పోవుచున్నాడు. ఒక ప్రతిభావంతుని విషయములో అతడొక మాలికశక్తియని మనము విశ్వసించుచుండు నంత వరకు అతని వలన కలుగు నిజమైన, ఉదాత్తమైన లాభమును మనము పొందలేము. 'కారణ' రూపమున అతడు మనకు సహాయ పడుట మానివేసిన క్షణమునుండి అంతకంటె ఎక్కువగా 'కార్య' రూపమునఅతడు మనకు సహాయపడ నారంభించును. అప్పుడతడు ఒక విశాలతరమైన మేధకు, సంకల్పమునకు ప్రతినిధిగా మనకు కన్పించును. పారదర్శకము కానట్టి వృథ గాత్మ 'ఆదిమ కారణపు' వెలుగు దానిమీద ప్రసరింపగానే పారదర్శకముగా మారిపోవును.

అయినను, మానవ 'విద్యా, విజ్ఞానముల అవధులకు లోబడి మన మొక మాట చెప్పకొనవచ్చును.మ హాపురుషులు తమకంటె మహత్తరపురుషుల ఆవిర్భావమునకై త్రోవలు తీర్చుటకొరకే లోకములో జన్మించు చుందురు. సంఘటిత ప్రకృతియొక్క గమ్యస్థానము అభ్యుదయము. కాని, దాని అవధులను ఎవరు నిర్ణయింపగలరు? మానవుడు తన జీవిత కాలములో వైజ్ఞానిక, సారస్వత బీజములను అన్నిదిశలందును వెదజల్లి, తద్ద్వారా ఋతువులూ, పంటలూ, జంతువులూ,

తోడిమానవులూ మరింత సాధుత్వము పొందునట్లు చేసికొనవలెను. ప్రేమయొక్కయు, సేవాభావముయొక్కయు అంకురములు సహస్రగుణములుగా వర్ధిల్లునట్లు చేసికొనవలెను. మానవుడే వినాశనము (Chaos) ను మచ్చిక చేసికొనవలసియున్నది.

"Representative Men"
నాల్గవ సంపుటము నుండి

# ఎమర్సన్ జీవితము.



ఎమర్సన్ మహాభావుకుడు. కవి. మానవజీవన వ్యాఖ్యాత. మహావక్త. అమెరికనులు ఆయనను తమ జాతీయసాహిత్య మూలపురుషులైన నలుగురు రచయితలలో ఒకడుగా ఆరాధించుచున్నారు. ఆయన రచనలు ఆంగ్ల సాహిత్య పరిచయముగల ప్రపంచమున కంతకు సుపరిచితములు. ఉదారలక్ష్యసాధనకై ఉదాత్త భావనలు చేసి, అచ్ఛసత్యాన్వేషణకు నిశ్చలదీక్ష వహించి మతసంప్రదాయ ఛాందసములు లేని అధ్యాత్మజీవనము సాగించి, ఇతరులలో గూడ ఆత్మోద్దీపన వాంఛల నుదయింపజేసిన సఫలజీవి-ఎమర్సన్.

ప్రముఖమతాచార్యుల వలె ఆయన ప్రజల భక్తి విశ్వాసములను జూరగొనెను. అయినను, ఇదమిత్థమని "ఫలానా" మతసిద్ధాంతమునకు చెందిన వాడుగా ముద్ర వేయుటకు లొంగని స్వేచ్ఛాభావుకుడు. నిజమునకు పాశ్చాత్య తత్త్వశాస్త్రమున కతడు కూర్చిన నూతన సిద్ధాంత మేదియు లేదు. కాంట్, కోల్‌రిడ్జ్ మున్నగువారి సిద్ధాంతముల కతడు తన నైతిక కవితా ప్రతిభలతో క్రొంగ్రొత్త వన్నెలు చిన్నెలు దిద్దెను. ఎమర్సన్ వాదమగు అనుభవాతీతవిజ్ఞాన వాదము (Transcendentalism) ను తత్త్వశాస్త్ర సిద్ధాంత

ముగ గొందరు పరిగణించిరి. కాని, అది యొక ప్రబోధ ప్రవచనము (Gospel) అన్న ఎక్కువ సబబుగ నుండును.

రాల్ఫ్‌వాల్డో ఎమర్సన్ అమెరికాలోని బాస్టన్ నగరములో క్రీ. శ. 1803 మే 23 వ తేదీన జన్మించెను. ఈయన తలిదండ్రులు ఆంగ్లదేశమునుండి వలసవచ్చిన గౌరవనీయ కుటుంబములకు జెందినవారు. తండ్రివంక ఎని మిది తరములవారు గౌరవప్రతిపత్తులు గల మతాచార్యులు.

ఎమర్సన్ బాల్యము నందే తండ్రి కాలముచేసెను. స్థితిమంతులు కాకపోవుటచే తల్లి సంరక్షణమున చిన్నతన మున నే ఎమర్సన్‌కు పొదుపరితనమున కావశ్యకమగు శిక్షణ మలవడెను. యుక్తవయస్సు వచ్చినతోడనే, అతనిని హార్వర్డ్ లో చదువునకు బంపిరి. అచట ఫ్రెంచి, జర్మన్ భాషలలో చరిత్ర మున్నగు అనేక విషయము లతనికి కొంతకొంతగ నేర్పబడెను.

హార్వర్డులో చదువు పూర్తిఅయినతరువాతఎమర్సన్ తన పిత్రాచారమగు మతప్రబోధక వృత్తికి ఆవశ్యక మగు సాధనసంపత్తిని సమకూర్చుకొన దొడగెను. 1826 లోను, 1827 లోను ఆయన చిన్నచిన్న ప్రదేశములలో మతప్రబోధకుడుగా పనిచేసెను. రెండుసంవత్సరములకు పిమ్మట ఆయన బాస్టన్‌లోని ప్రముఖ మతసంస్థలలో నొకటి యగు యూనిటేరియన్ చర్చికి అధిపతి అయ్యెను. కాని, అచిరకాలములోనే ఆ మతశాఖ కేవలాచార వ్యవహారము

లకు ఇచ్చుచుండిన ప్రాధాన్యమున్ను, వారి పద్ధతులున్ను ఆయనకు రుచింపలేదు. ఆచారనియమ పాలనముకన్న ధర్మప్రవర్తన ముఖ్యమనియు, శాస్త్రనామరూపాదులకన్న ఋజుప్రవర్తనము, మానవప్రేమ ముఖ్యమనియు ఆయన వాదించెను.

ఈ తన విశ్వాసములకు అనుగుణముగ స్వేచ్ఛగ ప్రవర్తించుటకు దన కవకాశ ముండినచో ఆ పదవిలో నుండుట కాయన కభ్యంతరము లేకుండెను. కాని, ఈయన అభిప్రాయములు పూర్వాచార పరాయణులగు నాటి మతాధిపులకు ఎంతమాత్రమును సరిపడలేదు. అందువలన 1832 లో ఎమర్సన్ తన పదవికి రాజీనామా యిచ్చెను. ఆపైనకూడ, ఐదారు సంవత్సరములు అడపతడప ఆయన తన అభిప్రాయానుసారము మతప్రబోధము సేయుచునే యుండెను. ఆయన అభిప్రాయముల నామోదించువారును చాలమంది బయలుదేరిరి. కాని క్రమముగ క్రైస్తవమతమున ప్రబలాచారమైన సమష్టిప్రార్థన విధానమును గురించియే ఆయన సంశయింప జొడగెను. ఒక పెద్ద సమావేశములో నొక వ్యక్తి మిగిలినవారందరి పక్షమున దైవప్రార్థన మొనరించుట ఆత్మోద్దీపకము కాకపోగా, భక్తిభావమును మందగింపజేయునను విశ్వాస మాయనకు ఏర్పడెను. ఇట్టి పట్టింపుల వలన ఆయన 1838 నుండి మతప్రబోధక వృత్తిని పూర్తిగ వదలిపెట్టి, స్వేచ్ఛాభావప్రకటన కనువగు ఉపన్యాసకవృత్తిని అవలంబించెను. ఉపన్యాసవేదికపై నిస్సందేహముగ స్వకీ

యాభిప్రాయములను ప్రకటించుటకు ఉపన్యాసకునికి సంపూర్ణావకాశ మున్నదనియు, మతప్రబోధక వేదికపై అట్టి అవకాశము లేదనియు ఆయన నిర్ద్వంద్వముగ ప్రకటించుచుండెను. వాస్తవమునకు, ఉపన్యాసమే అమెరికా సారస్వతమున ప్రముఖపర్యవసానములకు హేతువైనది.

బాస్టన్ చర్చి యుద్యోగము నుండి విరమించిన సంవత్సరమే ఎమర్సన్ భార్య కాలముచేసెను. ఈ దుర్ఘటనల నాత డెంత నిగ్రహముతో నెదుర్కొనినను ఆరోగ్యము చెడిపోయెను. 1833 వసంతఋతువులో ఆయన ఐరోపా యాత్రకు బయలుదేరెను. ఈ యాత్రను గురించికూడ ఆయన కొన్ని విమర్శలకు గురి అయ్యెను. "మానవులలో ఎన్నటికిని సంతృప్తి పరుపబడని మూడు వాంఛ లున్నవి : 1. ఐశ్వర్యవంతుల ధనాశ, 2. సదా పరిణామమును గోరు రోగి వాంఛ, 3. ఉన్నచోట పీడి మరి యెచ్చటికైనను పోవలెనను యాత్రాప్రియుని వాంఛ," అని ఆయన చమత్కరించెను. ఇవి ఆయావ్యక్తుల చిత్తచాంచల్యమునకు చిహ్నములని ఆయన అభిప్రాయము. అయినను, విదేశయాత్రలు స్థానము మార్పు అవసరమైనప్పుడు వైద్యప్రక్రియగా ఉపకరించగలవని ఆయన విశ్వాసము. 1833 లో ఆయన చేసిన యాత్ర ఈ విధముగ ఉపకరించినది. ఐరోపా యాత్రలో ఈయన చూడ దలచుకొన్నది, చూచినది, అచటి నగరాలను, చరిత్రాత్మక భవనాలను, ప్రాకృతిక దృశ్యాలను కాదు. అచటి రచయితల, భావుకుల సజీవమూర్తులను సంద

ర్శించి వారితో చర్చించుటయే ఆయన లక్ష్యము. ముఖ్యముగ కోల్‌రిడ్జ్, వర్డ్స్‌వర్తులు ఆయనను విశేషముగ నాకర్షించిరి. తనకన్న ఏడెనిమిదేండ్లు మాత్రము పెద్దవాడగు నాటి యువరచయిత కార్లైల్ ఈయనకు ప్రియతముడు. ఈ ముప్వురిని స్వయముగ గలసికొని ప్రసంగించెడి అవకాశ మాయనకు కలిగినది. కార్లైల్ కూడ, తనను గలసికొన వచ్చిన విద్వాంసు లందరిలో పవిత్రతలోను, ఆశయౌదార్యములోను ఎమర్సన్ అగ్రగణ్యుడని ప్రశంసించెను.

ఎమర్సన్ జీవితము బాహ్యసన్నివేశవైచిత్రి ఏమాత్రమును లేనిది, నిరాడంబరమైనది, ఒడుదుడుకులు లేనిది. 1834 లో ఆయన పాతకంకార్డ్‌లో స్థిరనివాస మేర్పరచుకొనెను. కంకార్డ్ ఆ రోజులలో ఏవో కొన్ని కర్రయిండ్లు మాత్రము గల పల్లెవలె నుండెడిది. కంకార్డ్ నదిలోనికి పోయే చిన్న వాగొకటి ఎమర్సన్ ఏర్పరచుకొనిన వాస క్షేత్రము మధ్యగ పోవుచుండెను. దాని తీరమున నిరాడంబరమైన ఒక మిద్దెయిల్లు కట్టుకొని, మిద్దెపైనగల ప్రశాంతమైన తన విద్యావ్యాసంగమందిరము నిండ నిరంతరోపయోగముచే ప్రాప్తించిన వార్ధక్యమును సూచించు గ్రంథసంపుటములను నింపుకొని, వాటిలో నతడు మునిగి తేలుచుండెడి వాడని ఆయన నా దశలో సందర్శించిన ఒక బుద్ధిమంతుడు వ్రాసెను. క్రైగెన్‌పుట్టక్‌లో చూచివచ్చినకార్లైల్ వైరాగ్య జీవితము ఆయనను విశేషముగ నాకర్షించినను, అంతగ

పారలౌకికమును, కేవలము లౌకికమునుగాని మధ్యేమార్గ జీవనమును ఆయన గడుపుచుండెను.

మానవు లందరును ఎప్పుడో ఒకప్పుడు ఎదుర్కొనవలసిన విషాదసంఘటనలు ఎమర్సన్‌కును తప్పలేదు. మూడు సంవత్సరములు సుఖముగ కాపురముచేసిన పిమ్మట ఆయన ప్రథమ భార్య కాలము చేయుటతోబాటు ఆయన గారాబు ముద్దుబిడ్డడు మరణించెను. పిమ్మట ఆయనకు మరల పుత్ర సంతానము కలిగెను. ఆయన తన కుటుంబములోను, ఆ చుట్టుప్రక్కలను అందరికిని అత్యంత ప్రేమపాత్రుడుగ నుండెను.

1833 లో ఎమర్సన్ కార్లైల్‌తో నిట్లు చెప్పెను :- "నాకు నా యిల్లు కాక, 22,000 డాలర్లు (సుమారు లక్ష రూపాయలు) రొక్క మున్నది. దీనిపై సామాన్య దినములలో సాలుకి నూటికి ఆరు డాలర్లచొప్పున వడ్డీ లభించుచున్నది. ఇంకె నా శీతకాలోపన్యాసములకు పారితోషికముగ లభించు ధనము తప్ప వేరు రాబడి నాకు లేదు. గత సంవత్సరము ఈవిధముగ నాకు ముట్టిన పారితోషికము 800 డాలర్లు (సుమారు 38,000 రూపాయిలు). ఈ ఆదాయముతో ఇంటిపట్టున ఉండిన, నేను ఐశ్వర్యవంతుడనే. ఇంటివద్ద నుండుట గాని, విదేశయాత్రలు చేయుట గాని నేను స్వేచ్ఛగ ఏర్పాటు చేసికొను కార్యక్రమములు. నాకు మృష్టాన్న భోజనము, వసతి, విశ్రాంతి, కోరిన గ్రంథసంచయము,

మిత్రులు—సుఖజీవన సాధనసంపత్తి యంతయు నున్నది. అయినను, ఇల్లు విడిచి బయలుదేరిన నేను ఐశ్వర్య వంతుడను గాను. విలాసములకు వెచ్చించుటకు నా కొక డాలరు కూడ మిగులను. ఐశ్వర్య మనిన స్వేచ్ఛగ వెచ్చింపగలుగు అవకాశ మని అర్థము చెప్పికొన్నచో విజ్ఞు డెవ్వడును తానైశ్వర్యవంతుడ నని భావింపజాలడు. నేనంతి విజ్ఞుడను కాకపోయినను, నాదియు నదియే భావము. కాని, ఇంటి వద్దనే యుండిన నేను పదిమంది సోదరులను కూడ పోషింప గలను. నా భార్య లిడియా క్రైస్తవమతమునకు, దయకు మూర్తీభావము. వయసు మళ్ళిన నా తల్లి పూర్వాచార పరాయణురాలు. సర్వదా ప్రాచీన వస్తువులే ఆమెకు ఇష్టము—ఒక్క ఆమె కుమారుడు మాత్రమే ఇందుకు మినహాయింపు. ఇక మా కుర్రవాడు అత్యంత ప్రీతిపాత్రుడు. ఉదయాద్యస్తమయ పర్యంతము వానినే చూచుచు కూరుచున్నను నాకు విసుగు కలుగదు. ఇంటిలో పనిచేయుటకు ముగ్గురు పనికత్తెలు గలరు. నా విద్యావ్యాసంగ మందిరములో నే నొక పద్ధతి యనునది లేకుండగ చదువుకొనుచు, వ్రాసికొనుచు, రచనలు సేయుచు కాలము గడుపుచుందును......

''వేసవిలో నేను తోటపని చేసికొనుచుందును. నాకు, నా కుర్రవానికి శీతపవనముల తాకిడి లేకుండగ నివారించుటకు ఇటీవలనే మా యింటికి పశ్చిమదిశను నలభై పైన్ మొక్కలు నాటితిని. ఇంక, నా కత్యంత ప్రీతిపాత్రులు అప్పు

డప్పుడు మా యింటికి వచ్చుచుండు మాన్యులైన విద్వాంసులు.''

కొంతకాలమునకు ఆయన వాల్డెన్ అను అరమైలు పొడుగున ఉన్న పెద్ద సరస్సు ఒడ్డున గల నలభై యకరముల అడవిని కొనెను. ''నేను వేసవికాలములో నాయం సంధ్యావేళల నా గొడ్డలితో ఆ చెరువుఒడ్డున సన్నని దారి వరకి అచటి లోకోత్తర ప్రకృతి దృశ్యములను మొట్టమొదటి సారి మానవుని దృష్టికి దెచ్చితిని''అనికూడఆయన కార్లైల్‌తో చెప్పెను.

ఆ ప్రాంతపు సాంఘిక వ్యవహారములలో గూడ ఆయన ప్రముఖ పాత్ర నిర్వహించుచుండెను. ఇరుగు పొరుగు వారికి చేదోడు వాదోడగుచుండెను.అతడు కార్లైల్‌తో చెప్పిన పది పన్నెండుగురు విశిష్టాతిథులు గాక - మతిమంతులు, మతి భ్రమణము గలవారు అగణిత సంఖ్యాకులగు యాత్రికులు ఏటేట ఆయన సాదరాతిథ్యమునకు పాత్రులగుచుండిరి. నిరాశోపహతులై గాఢాంధకారములో తారటలాడుచుండిన వారిపాలిట ఈ విజ్ఞానఖని వేగుచుక్కగ నుండెనని ఆయన పొరుగున కొంతకాలము (1842 మొదలు 1845) వరకు నివసించిన ప్రసిద్ధ రచయిత హాథార్న్ వ్రాసెను.

ఎమర్సన్ మిత్రులలో అగ్రగణ్యుడు హెన్రీడేవిడ్ థోరో. ఈయన మూర్తుల భారతీయుల ఋషి సంప్రదాయమునకు జెందిన వానివలె కనిపించును. ఇతడు వాల్డెన్

సరోవరతీరము నందలి అడవి నడుమ తానుగ నిర్మించుకొనిన కుటీరములో ఏకాంతవాసియై తపస్సు చేసికొనుచుండెడివాడు. ఈయన అనుపమవ్యక్తిత్వము ఎమర్సన్‌ను విశేషముగ నాకర్షించెను. అయినను, ఎమర్సన్, థోరో వలె ఏకాంత వనౌకస జీవితము గడపలేదు. "ఏకాంతవాసము అసంభవము. సాంఘిక లౌకిక జీవితము ఆత్మహత్యాకరము," అని ఆయన విశ్వాసము. ఈ రెంటింటికిని మధ్యేమార్గమును ఆయన అవలంబించెను.

మత ప్రబోధకుడుగ ఎమర్సన్ తన ప్రశాంతగాంభీర్యముతోను, అప్రయత్నసిద్ధము, నిరాడంబరము నగు సహజ వాగ్ధోరణితోను ప్రేక్షకులను సులభముగ నాకట్టుకొనగలడు. ఎమర్సన్ మతప్రవచన సామర్థ్యమును స్వయముగ చవిజూచిన ఒకానొక ప్రత్యక్షసాక్షి ఇట్లు వ్రాసెను: "నేను షామర్స్ ఆచార్యుని అద్భుత ప్రవచనములను వింటిని. ఆయన తన వాగ్ధాటితో తన యెదుట నున్న ప్రేక్షకసమూహ మంతటిని కుమ్మరివాని చేతిలోని బంక మన్ను వలె మార్చివేసికొనగలడు. కాని, నిజము చెప్పవలె నన్న నా యభిప్రాయము బాస్టన్‌వాసి అయిన ఆ యువ ప్రవక్త (ఎమర్సన్) ప్రవచన మింతకన్న మనోహరమైనది." ఉపన్యాసవేదికపై కూడ ఎమర్సన్ ఈ శక్తిసామర్థ్యము లన్నిటిని ఇంకను విశేషముగ ప్రదర్శించెను. "నేను చాల మంది మహావక్తల ఉపన్యాసములను వింటిని. కాని, ప్రేక్ష

కులను ఉపన్యాస విషయ నిమగ్నులను జేసి ప్రోత్సహించు టలో ఈయన (ఎమర్సన్) కు ఈయనయే సాటి,'' అని లోవెల్ వ్రాసెను.

ఎమర్సన్ 1838 లో హార్వర్డ్‌లోని డివినిటీ స్కూలులో చేసిన ఉపన్యాసము బహుముఖ ఖండనమండన ములతో పెద్దపెట్టున గాలిదుమారమును రేపి. ఆయన ప్రయత్నమేమియు లేకుండగనే ఆయన నొక నూతన మత వర్గానికి నాయకునిగ జేసినది. స్వయముగ ఆయన ఈ వివా దములోనికి దిగలేదు. "వివాదము నాకు ఇష్టములేదు. నిజమునకు నా కా సామర్థ్యమును లేదు. కారణము చెప్పు మనిన నా వలన కాదు. మనసులోని మాటను బహిరంగ ముగ ప్రకటించుట నా కానందము గూర్చు అభ్యాసము. కాని, 'నీవా విషయు మట్లు చెప్పుట కెట్లు సాహసించితి' వని నన్నెవరేని నిలువదీసి యడిగిన నేను బదులుచెప్పలేని నా నిస్సహాయస్థితిని ప్రకటింతును,'' అని ఎమర్సన్ స్వయముగ జెప్పికొనెను. 1837 ఆగస్టు 31 వ తేదీన "అమెరికా విద్వాంసుడు'' అను విషయముపై ఎమర్సన్ కేంబ్రిడ్జ్‌లో చేసిన ఉపన్యాసము కార్లైల్ పండితుని అమితానందపర వశుని జేసినది.

పిమ్మట 1836 లో బాస్టన్‌లోని స్వతంత్ర భావనా ప్రియులైన కొందరు యువకులతో అనుభవాతీత విజ్ఞాన వాద సమితి (Transcendental Club) ఏర్పాటయినది. వీరు

సంవత్సరమునకు నాలుగైదుమారు లొంకొరుల గృహముల లోనే సమావిష్టు లగుచు ఆస్తికవాద సమస్యలను గురించి స్వేచ్ఛగ చర్చించుకొనుచుండిరి. ఈ సమితివారు 1840 లో 'డయల్' (Dial) అను పేరుతో నొక త్రైమాసిక పత్రికను ఆరంభించిరి. ఈ పత్రికా ప్రచురణము నాలుగేండ్లపాటు నాగెను. ఎమర్సన్ విడువకుండ ఈ పత్రిక ప్రతిసంచికలోను తన రచనలను ప్రకటించు చుండెడివాడు. ఈ పత్రికా జీవిత కాలమున కడపటి రెండు సంవత్సరము లాయనయే దాని సంపాదకత్వ బాధ్యతను కూడ నిర్వహించెను. ''ఈ పత్రికకు చందాదారులు చాలినంతమంది ఉండెడివారు కారు. అందువలన రచయితలకు, సంపాదకులకు చిల్లిగవ్వ ఇవ్వక పోయినను, ఒక్కొక్కప్పుడు ప్రచురణ కర్తకు చెల్లించవలసిన మొత్తముకూడ పూర్తిగ సమకూరెడిది కాదు. వార్తా పత్రికల నుండి మాకు అవహేళనములు, దూషణములు మాత్రము పుష్కలముగ లభించుచుండెడివి. ఇక వార్తా పత్రికలనుండి మాకు లభించు సహకార మెల్ల వారు మా పత్రిక పేరెత్తకుండుటయే......మొత్తముమీద ఈ పత్రిక అమూల్యమైన నా కాలమును అల్పప్రయోజనార్థము వ్యర్థము చేసినది,'' అని ఎమర్సన్ కార్లైల్‌తో జెప్పెను. 'ఆ పత్రికలో ఎమర్సన్ రచనలను మినహాయించిన మిగిలినవన్నియు- ఏ పది పన్నెండో తప్ప- కేవలము నీరస రచనలు.

1841 లో ఎమర్సన్ వ్యాసముల ప్రథమ సంపుటము ప్రకటింప బడెను. పిమ్మట మూడేళ్ళకు రెండవ సంపుటము

వెలువడెను. ఆయన పద్యరచనలు 1847 లో తొలిసారి సంపుటీకరింప బడినను, 1876 నాటికి గాని వాటికి అంతిమ రూప మేర్పడలేదు. 1847 లో ఎమర్సన్ రెండవసారి ఇంగ్లండు వెళ్ళి "ప్రజాప్రతినిధులు" అను విషయముపై ఉపన్యాసము లొసగెను. ఈ యుపన్యాసములు 1850 లో ప్రకటింపబడెను. ఈ గ్రంథములకు ఆదిలో చలామణి అత్యల్పముగ నుండెను. కాని, 1860 లో 'జీవనప్రవృత్తి" యను శీర్షికను బ్రకటింపబడిన ఆయన వ్యాసములు, ఉప న్యాసములు మాత్రము 2,500 ప్రతులు వేగముగ నమ్ముడు పోయెను. వాస్తవమున కా సంపుటము ఎమర్సన్ ఉత్తమ రచనలలో పరిగణింప తగినదికాదు.

ఇంతలో అమెరికా చరిత్ర ప్రముఖ సంఘటన అగు అంతర్యుద్ధము ప్రారంభమాయెను. ఈ యుద్ధమునకు ప్రధాన కారణములలో నొకటి - దక్షిణాది రాష్ట్రములలోని బాని సత్వపద్ధతిని గురించిన వివాదము. ఎమర్సన్ అచటి బానిసత్వ పద్ధతిని ఇతర ప్రాంతములకు విస్తరిల్లనీయరాదని వాదించు ఫ్రీ సాయిలర్ (Free Soiler) పక్షమునకు జెందినవాడు. బాని సత్వమును బలవంతముగ నిర్మూలింపవలెనని కూడ ఆయన వాదించుచుండెను. కాని, బానిసత్వ నిర్మూలనోద్యమములో ఆయన ప్రత్యక్షముగ మాత్రము పాల్గొన్నది లేదు. నడుమ నడుమ నిట్టితర రంగములలో బ్రవేశించుచున్నచో - తన ప్రధానాశయ సాధన కృషి కుంటువడునని ఆయన భయము.

అయినను మద్యపాన నియమము, బానిసత్వనిర్మూలనము మున్నగు సముద్యమము లన్నిటికిని ఆయన నైతిక ప్రోత్సాహము సర్వదా పుష్కలముగ లభించుచుండెను. సత్పురుషుల సర్వయత్నములను ఆయన సమర్థించుచుండెను. బానిసత్వనిర్మూలనోద్యమమునకై సాహసముగ హృదయపూర్వకముగ కృషి చేసిన నేరమునకు గాను ఉరిశిక్షకు గురియైన జాన్ బ్రౌన్ కంకార్డ్ పట్టణమునకు వచ్చినప్పుడెల్ల ఎమర్సన్ గృహమున ఆయనకు హార్దిక స్వాగతము లభించుచుండెను.

అంతర్యుద్ధానంతరము అమెరికాలో నైతిక ఆధ్యాత్మిక నాయకులపట్ల ప్రజాదరణము వృద్ధి అయినది. ఎమర్సన్ ప్రతిష్ఠ, పలుకుబడి అత్యుచ్చస్థాయి నందుకొన్నవి. జీవిత సాయం సంధ్యాసమయములో కూడ ఎమర్సన్ చివరివరకు విద్యావ్యాసంగము సేయుచు, విజ్ఞానభావనములు, చర్చలు సాగించుచు, ఉపన్యాసము లొసగుచు ప్రశాంతముగ గడపెను. చిట్టచివరకు కొంతకాల మాయన జ్ఞాపకశక్తి కొంత సన్నగిలెను. కడకు స్వగృహములోను, పరిసరములలోను, స్వదేశములోను అందరి గౌరవప్రపత్తులకు పాత్రుడైన సచ్చరిత్రుడు, ఎమర్సన్ పండితుడు 1882 ఏప్రిల్ 27 వ తేదీన ప్రశాంతముగ నస్తమించెను.



